# ఆత్మీయులు

[ సాంఘిక నాటకం ]

రచన

పినిశెట్టి శ్రీరామమూర్తి

ప్రచురణ

సమతా ప్రచురణలు
మదరాసు — పాలకొల్లు.

వెల : ఒక రూపాయి పావలా 

# ము ఖ్య గ మ ని క

1 నా అనుమతి పత్రము లేనిదే ఈ నాటకాన్ని ఎవ్వరూ, ఎక్కడా ఏవిధమైన ప్రదర్శనాన్నీ ఇవ్వకూడదు. దీనికి వ్యతిరేకంగా ప్రదర్శించిన నటీనటులూ-నాటక నిర్వాహకులూ-నాచే జరపబోవు సివిల్, క్రిమినల్ చర్యలకు బాధ్యులౌతారు.

2 ప్రత్యేకించి నాటకపోటీల్లో పాల్గొనే సంఘంవారు, ట్రూప్ వివరాలు వ్రాసి, నా అనుమతి పత్రాన్ని పొందిన తర్వాతనే, ఇతర ప్రయత్నాలు చేసుకోవాలి.

3 ఒకే ప్రదర్శనానికి — నా అనుమతి పత్రాన్ని పొందగోరేవారు "గీతా ఆర్టు ప్రింటర్సు, పాలకొల్లు (W. G. Dt.)" వారిపేర 15 రూపాయలు పంపిన బడయగలరు.

ర చ యి త

ప్రథమ ముద్రణ 1956. గీతా ఆర్టు ప్రింటర్సు

# మ న లో మ న ం

'అన్నా-చెల్లెలు' నాటకం తర్వాత ఆంధ్ర నాటక కళాపరిషత్తు పోటీ ప్రదర్శనాల్లో పాల్గొనాలనే కుతూహలంకొద్దీ వ్రాసిన నాటకమిది. అందుచేతనే 1954 సం॥రం బందరులో జరిగిన, పరిషత్ సభలకోసం ఒక నాటక ప్రతినికూడా పంపించాను.

మదరాసులోనే నేను వుండటంవల్ల, మా మండలి సభ్యుల కొందరితోనూ, మరికొందరు సినిమానటమిత్రులతోనూ, రిహార్సల్సు ఆరంభించాను.

ఆంధ్ర నాటక కళాపరిషత్తువారు ఈ నాటకాన్ని ఆమోదించడమే గాక, మండలిపట్ల ఉన్న మంచిభావంతో, ఆఖరి ఘడియవరకూ అవకాశం కూడా యిచ్చారు. కాని దీనిలో పాత్రలుధరించే ముఖ్యమిత్రులకు-సినిమా షూటింగ్సు వత్తిడి ఎక్కువకావడంద్వారా, ఆ సంవత్సర నాటక పోటీల్లో పాల్గొన లేకపోయాను.

తిరిగి హైదరాబాద్‌లో జరిపిన పరిషత్ సభల్లోనన్నా ప్రదర్శించాలని, ప్రయత్నించి, విఫలుడనయ్యాను.

ఇంతకూ ప్రచురణకుముందు నాటకాన్ని ప్రదర్శించి ప్రేక్షకుల అభిప్రాయాన్ని సేకరించడం నాకు ఒక అలవాటేకాదు, తృప్తికూడా—కాని అనేక అనివార్య కారణాలవల్ల ఆ ఆశకూడా నెరవేరకుండానే ప్రచురించవలసివచ్చింది. సద్విమర్శకుల సలహాలను గౌరవించి మలి ప్రచురణలో సాధ్యమైన మార్పులు చేసుకుంటాను.

నా నాటకాలపట్ల అపార ఆదరణ చూపిన ప్రేక్షక, నట, పాఠక లోకానికి నా కృతజ్ఞత లందజేస్తూ, ఈనాటకాన్నికూడా ఆప్యాయంగా ఆదరించగలరని ఆశిస్తూ అందజేస్తున్నాను.

పి ని శె ట్టి

# పాత్రలు

| | |
|---|---|
| లక్ష్మీపతి | వయస్సు 60......ధనికుడు. రోగి. ఆవేశపరుడు. మేధావి. |
| నాగేంద్రం | వయస్సు 35......అతని అల్లుడు. కౌన్సిలర్. పేరుకుతగ్గమనిషి. |
| ప్లీడరు | వయస్సు 50......లక్ష్మీపతి మిత్రుడు. తెలివైన వాడు. మంచి మాటకారి. |
| సుబ్బారావు | వయస్సు 20......పజిల్సంటే యిష్టం. పరాకు చిత్తం. హాస్య ప్రవర్తన. |
| డాక్టర్ | వయస్సు 50......ఈయనా లక్ష్మీపతి శ్రేయోభిలాషే! యోగ్యుడు. |
| గోపి | వయస్సు 8 ......తల్లిలేనిబిడ్డ. లక్ష్మీపతి రెండో భార్య కొడుకు. |
| శాంతమ్మ | వయస్సు 35......విధవ. లక్ష్మీపతి మరదలు. శాంతస్వభావం కలది. |
| సుందరమ్మ | వయస్సు 25.....నాగేంద్రంభార్య. కల్మషురాలు. పైకి శాంతంగా వుంటుంది. |
| సరోజ | వయస్సు 15......మంచిదే. అహం ఎక్కువ. సుబ్బారావు భార్య. |

# ఒకటో రంగం

[ఒక హాలు. ఎదురుగా వీధిలోనుంచి ప్రవేశించే గుమ్మం. అటు యిటు కిటికీలు. కిటికీలకు కర్టన్సుకూడా వుంటాయి. హాలు కుడివైపున మేడపైకి పోయే మెట్లుంటాయి.

గోడలకు ఆధునికంగా ఉన్న అందమైన రెండు పాత కేలండర్లు; ఒక ఆఫీసు కేలండరు - ఆ రోజు తేదీ చూపుతుంది. రెండు పెయింటింగ్సు వుంటాయి. అటు యిటు స్టాండ్‌పై కూజాలలో పూలమొక్కలుంటాయి. ఒక ప్రక్క రేడియో, అందమైన సోఫాసెట్ గుమ్మం ప్రక్కగా అద్దంతో ఉన్న డ్రాయరు. ఎదుట చిన్న కుర్చీ. హాలు చూసేసరికల్లా ఉన్నవాళ్ల యిల్లులా స్ఫురిస్తుంది.

తెరలేచేసరికి రేడియో సన్నగా పాడుతూవుంటుంది. డాక్టరు, ప్లీడరు, లక్ష్మీపతి పేకాడుతూ వుంటారు - చీకటిగా వుంటుంది. మెల్లగా లైట్లు వెలుగుతాయి... చాలా శ్రద్ధగా ఆడుతూవుంటారు. గోపీ మేడ మెట్లమీదనుంచి, పరుగున వస్తాడు. ముగ్గుర్నీ చూస్తాడు...ఆగిపోతాడు. మాటుకాస్తున్నవాడిలా లక్ష్మీపతి దగ్గరకువచ్చి, కొన్ని పేకముక్కలు దాచి, తిరిగి వెళ్లబోతూవుంటాడు. ప్రక్క ద్వారంలోనుంచి శాంతమ్మ కాఫీలు తీసుకువస్తూ.........]

శాంతమ్మ : గోపీ.........

[అంతా అటు చూస్తారు. కుర్రాడు ఆగిపోతాడు]

శాంత : ఏమిటా పని. పేకముక్కలక్కడ పెట్టు -

[తిరిగి తీసుకురాబోతుంటాడు. సరోజ మేడమెట్లమీదకు వస్తుంది. ఆమె చేతులో యంబ్రాయిడ్రి కుట్టే ఫ్రేమ్ వుంటుంది.]

సరోజ : ఆగరా గోపీ [మెట్లుదిగి క్రిందకువస్తూ] ఇటు తీసుకురా......

[గోపీ నిలబడి అటు యిటు చూస్తాడు.]

లక్ష్మీపతి : ఏమిటమ్మాయి అది.

సరో : ఎందుకు నాన్నా రోజూ పేకాట.

లక్ష్మీ : నేను ఒక్కణ్ణే కాదుగా అంత తెలివి తక్కువగా ఆడుతున్నది. ఇటు ప్లీడరుగారూ అటు డాక్టరుగారుకూడా ఉన్నారు... ఏదో కుర్రవాళ్ళం ఆడుకుంటున్నాం. నీలాంటి పెద్దది చూసీ చూడనట్లు పోవాలిగాని, గదురుకుంటే ఎట్లాగమ్మా.

[ఈలోపుగా శాంతమ్మ కాఫీలుపెట్టి, గోపీ చేతిలో పేక ముక్కలు తీసుకుని అక్కడపెట్టి లోపలకు వెళ్ళిపోతుంది]

సరో : చూడండి ప్లీడరుగారూ- మా నాన్నగారి మాటలు.

ప్లీడరు : ఏదో మేము సరదాగా ఆడుకుంటున్నపుడు అబ్బాయిని పేకముక్కలు పట్టుకరమ్మని పంపించడం ఏమంత బాగుంది చెప్పమ్మా-?

సరో : మీారు రోజూ ఇలా పేకాడ్డం బాగుందేమిటీ?

డాక్ట : బాగంటే అర్థమేమిటో చెప్పు సరోజా?

గోపి : బాగు అనగా 'చెడనిది' 'మంచిది'——

సరో : గోపీ!

గోపి : డాక్టరుగారు చెప్పమన్నారుగా -

సరో : నిన్ను కాదు- నన్ను-

గోపి : నువ్వు చెప్ప లేకపోయావుగా -

[పేపరుతో సుబ్బారావు వేటే గదిలోనుంచి వస్తాడు]

సుబ్బా: బాగా అన్నావురా బావమరిదీ! ఆఁ! సరూ ఏమిటీ గొడవ?

సరో : మిమ్మల్ని ఇక్కడికెవరు రమ్మన్నారు?

సుబ్బా: ఒకళ్లు రమ్మంటే నేనెలా వస్తాను?

సరో : లోపలకు వెళ్లండి.

సుబ్బా: వెళ్లవలసిందేనా?

సరో : తక్షణం!

సుబ్బా: వెళ్లమంటే తప్పుతుందా! కాని సరోజా! నన్ను ఇలా ఇన్‌సల్టు చేయడం మంచిపనికాదు. మన చేతికి పజిల్సుడబ్బు రాగానే-నువ్విట్లా అంటూంటే ఊరుకోను తెలుసా?

సరో : మీకాక్కాదూ చెప్పేది?... వెళ్లండి!

[భయంగా చూసుకుంటూ వెళ్తాడు... అంతా నవ్వుతారు. ఆ నవ్వుతో సరోజ చురచురా చూస్తుంది. లక్ష్మీపతికి నవ్వల్లా పెద్ద దగ్గులోకి మారుతుంది. అంతా భయంగా చూస్తారు. లోపలినుంచి తిరిగి సుబ్బారావు - శాంతమ్మ వస్తారు.]

సరో : [కళ్లనీళ్లు పెట్టుకుంటూ] చూడండి డాక్టరుగారు! నేను చెబితే మీరు వినరు. నాన్నగారి ఆరోగ్యం ఏమీ బావుండలేదు. కాస్త ఆలోచిస్తే ఆయాసం వస్తుంది. గట్టిగా నవ్వితే దగ్గొస్తుంది. ఈ పేకాట ఆడొద్దని

ఎన్నిసార్లు చెప్పేను. నామాట వింటేనా? పేక తీసేయండి... చింపేయండి.

[ఈలోగా శాంతమ్మ పీకిదాని తీసుకవచ్చి, లక్ష్మీపతి ఉమ్మి వేయగా లోపలకు తీసుకపోతుంది. సరోజ మాటలు విని సుబ్బారావు ఉద్రేకంగా పేక చేతబట్టి చించడానికి ప్రయత్నించే లోగా ప్లీడరు దగ్గరికి చేరతాడు]

ప్లీడ : సుబ్బారావ్! ఏది పేక!

సుబ్బా: [భయంగా చూస్తాడు.]

సరో : చింపేయండి.

డాక్ట : [కొంచెం బిగ్గరగా] చింపకు ఇలా తీసుకురా!

[సుబ్బారావు భయంగా తీసుకువచ్చి యిస్తాడు]

డాక్ట : సరోజా! మీ నాన్నగారు దగ్గుతో ఆయాసపడితే నువ్వు ఆవేశంతో ఆయాసపడ్డావ్. అంతే తేడా.

సరో : డాక్టరుగారూ!

డాక్ట : డాక్టర్నే... నేను యింకా యాక్టర్నికాలేదు.

సుబ్బా: నేను యిప్పుడు ప్రయత్నిస్తున్నా.

సరో : షటప్.

డాక్ట : ఎవర్ని?

సుబ్బా: [భయంగా] నన్నులెండి... [వెళతాడు]

డాక్ట : లక్ష్మీపతిగారూ! మీ అమ్మాయి పద్ధతి ఏమీ బావుండలేదు. సాయం సమయంలో సరదాగా క్లబ్‌లో కాలక్షేపం చేసేదానికి బదులు మీ ముద్దుల కూతురు — చీత్కారాల మధ్యా — చీదరింపుల మధ్యా ఏమిటీ ఆట.

సరో : డాక్టరుగారూ! మర్యాదగా మాట్లాడ్డం మంచిది-

లక్ష్మి : [కోపంగా] అమ్మాయ్! నీకు పెద్దా చిన్నా తార తమ్యంలేదూ? ఏమిటా మాటలు లోపలికి పద.

సరో : [కళ్లనీళ్లతో] మీ ఆరోగ్యం గురించి చెప్పిన నన్నే మాటలంటున్నారూ? ఇదేమన్నా న్యాయంగా ఉందా నాన్నగారూ?

ప్లీడ : అన్యాయంగానే వుందనుకో - లోపలకెళ్లమ్మా.

సరో : [కళ్లనీళ్లతో] అందరూ నన్నే అంటారు. అయినా నేనెవర్ని మీకు చెప్పడానికి. మీకు కావలసిన వాళ్లు వేరే వున్నారు. వాళ్లు చెప్పిన మాటలు వింటారు. నేను యింట్లో ఏమీకాను - నాకేమీ సంబంధంలేదు... నాకెందుకు...

[ఏడుస్తూ వెళుతుంది]

లక్ష్మి : పిచ్చిపిల్ల! ఆవేశం ఎక్కువ; ఆలోచన తక్కువ.

[సరోజ మెట్లు ఎక్కేటప్పటికే శాంతమ్మ బౌన్సుగ్లాసులో మందుపోసుకవచ్చి యిస్తుంది. లక్ష్మీపతి మందుతాగి గ్లాసు యిస్తాడు.]

లక్ష్మి : శాంతా! గోపీ అన్నం తిన్నాడా?

శాంత : తింటున్నాడు.

లక్ష్మి : నువ్వు?

శాంత : ఇంకాలేదు. తింటాను.

[వెళ్లిపోతుంది... వెళ్లే శాంతను చూస్తూ లక్ష్మీపతి నిట్టూరుస్తాడు]

ప్లీడ : పాపం - నిస్వార్థరాలు.
డాక్ట : ఆశలన్నీ పోయిన తర్వాత అంతా అంతే.
లక్ష్మి : అలా అనుకోవడం పొరపాటు.
ప్లీడ : అన్నీ శంకించడం ఈయనకు అలవాటు.
లక్ష్మి : అన్నమంతా పట్టుకుచూడాలా డాక్టర్!
డాక్ట : అది సామెత మాత్రమే!

[సుబ్బారావు వస్తూ పేపరు చూస్తూ]

సుబ్బా: కొన్ని అక్షరాలు పేరిస్తేగాని, పదాలు ఏర్పడవ్. కొన్ని పదాలు గుదిగుచ్చితేనే గాని వాక్యంకాదు. వాక్యం పూర్తికానిదే మనకి భావం అర్థంగాదు.

[హఠాత్తుగా చూసి]

మా యావిడ వెళ్లిపోయిందా? మావయ్యా! లాయరుగారితో కొంచం పనుంది...... కాస్త యిలారండి. [కాగితం చూపుతూ] ఈ తొమ్మిదో నెంబరు వాక్యం చూడండి. సాధారణంగా మానవులకు ఎంత ప్రయత్నించినా తమ కోరిక నెరవేర నపుడు 'ఇది' పెరుగుతుంది. ఈప్రక్క చూడండి... 'కోపం'...'తాపం' ఏది కరెక్టంటారు?

లక్ష్మి : సుబ్బారావ్! నీకేం పనిలేదూ!

సుబ్బా: ఇది పనికాదు మావయ్యా! మూడు రోజులనుంచి బుర్ర పాడుచేసుకొని - తొమ్మిది ఎంట్రీలు పూర్తి

చేసాను... ఏం లాయరుగారు... ఇదొక్కటే నాకు పెద్ద డౌట్‌గా వుందండీ...ఏది కరెక్టంటారు?

ప్లీడ : మీ యావిడ్ని అడగవోయ్.

సుబ్బా: అమ్మోయ్!... చించిపారేయదూ?

ప్లీడ : ఎందువల్ల?

సుబ్బా: కోపం.

ప్లీడ : అదే త్రాయి.

సుబ్బా: [నోరావులించి] అమ్మ! ఎంత తెలివైనవారండీ! అందుకే మిమ్మన్ని ప్లీడరన్నారు. ఏదీ ఒక్క షేక్ హాండ్ పారెయ్యండి.

[షేక్‌హాండ్ తీసుకుని అక్కడ కూర్చుని రాసుకుంటూ వుంటాడు]

[గోపి పరుగున వస్తాడు]

గోపి : నాన్నా! మరి చిన్నమ్మే ఇంకా అన్నం తింటంలేదు.

లక్ష్మి : ఇంతవరకు ఏం చేస్తుంది?

గోపి : మీకు పళ్లరసం తీస్తుంది.

లక్ష్మి : తరువాత తీయొచ్చునులే అని చెప్పు.

గోపి : చెప్పాను నాన్నా! నామాట వినడంలేదు.

[శాంత రసం తీసుకవచ్చి అక్కడపెట్టి వెళ్లబోతుంది]

లక్ష్మి : శాంతా!

శాంత : [ఆగి చూస్తుంది]

లక్ష్మి : టైమ్ దాటింది, భోజనం చేయకూడదూ?

శాంత : చేస్తాను.

[గోపి, శాంత వెళతారు]

లక్ష్మి : [నిట్టూరుస్తాడు] ఊఁ!

ప్లీడ : ఏమండీ యీామె......

లక్ష్మి : అవును బంధువు, మరదలవుతుంది.

ప్లీడ : ఎవరూ లేరా అని.

లక్ష్మి : లేకేం - మా గోపీ నేనూ ఉన్నాంగా.

డాక్ట : లక్ష్మిపతిగారంటే ధనవంతులేగాదు — మేధావంతులు కూడా.

లక్ష్మి : మీా అభిప్రాయం?

డాక్ట : గోపి మీారూ ఆమెకున్నారంటే అర్థం — ఆమెచేత వెట్టిచాకిరీ చేయించుకోడానికి, కడుపునిండా కాస్త భోజనంపెట్టి, తెల్లటి బట్ట యివ్వడానికి. అంతే కదూ?

లక్ష్మి : అంత స్వార్థుడుగా నన్ను అర్థంచేసుకోవద్దు డాక్టర్!

డాక్ట : మీా పరార్థంలో వుండే పరమార్థం ఏమిటో.

లక్ష్మి : మీాకు చెప్పినా అర్థంగాదు......

డాక్ట : ధైర్యముంటే ఆమెను పెళ్లిచేసుకోరాదూ! మీాకెంత త్యాగముందో తెలుస్తుంది... మీా యింట్లో ఒక జ్యోతి నిలుస్తుంది.

లక్ష్మి : [విరక్తిగా నవ్వుతాడు] పెళ్లి! నాకు పెళ్లి! ఇప్పటికి ఇద్దరు నానుండి సెలవు తీసుకున్నారు... వాళ్లను పుణ్యవతుల్లా పరలోకం పంపించాను. మొకటి భార్యకు యిద్దరూ కూతుళ్లే!... రెండో ఆమెకు ఆ గోపీ. వాడి పోషణే నాకు భారమైపోయింది... తన అక్క కొడుకనే ఆప్యాయతతో, నేను పిలవగానే శాంతమూర్తిలా నా యింటికి చక్కా వచ్చింది శాంతమ్మ...ఆమె జీవితాశయం -- గోపీ పోషణేనా? నేను ఆరోగ్యంగా ఉండడమేనా? అని అనిపిస్తుంది.

[సరోజ అప్పటికే మాటలువింటూ వచ్చి వెనక నిలబడుతుంది.]

సరో : కవిత్వం చెబుతున్నావేమిటి నాన్నా!

లక్ష్మి : [కష్టంగా] సరోజా!

సరో : ఏమిటి నాన్నా అది. ఎవరో దిక్కులేనామె తల దాచుకోడానికి మనింటికొస్తే అందరి ఎదటా ఆమె గురించి ఆ పొగడ్డం ఏమిటీ? నలుగురూ ఏమనుకుంటారు నాన్నా!

డాక్ట : మేమున్నది యిద్దరమేనమ్మా!

ప్లీడ : ఏమన్నా అనుకుంటామనే భయం నీ కక్కర లేదమ్మా...... ఏమీ అనుకోం.

సరో : ఏమండీ ప్లీడరుగారూ! హిందూలా ఏమన్నా మార్చడానికి వీలుంటుందేమో ఎప్పుడైనా ఆలోచించారా?

ప్లీడ : ఆలోచించేవాళ్లు ఆలోచిస్తూనే వున్నారు.

సరో : అదికాదండీ-- ఆడవాళ్లుకూడా మగవాళ్లలా రెండు మూడు పెళ్లిళ్లు చేసుకోవచ్చనీ----

డాక్ట : అలాంటి అవసరం నీ కిప్పుడేముంది?

[సుబ్బారావు ప్రవేశిస్తూ]

సుబ్బా: ఏమిటిసరోజా! అప్పుడే అంతదారుణం తలపెట్టేవా! నేను ఏమయ్యాననుకున్నావ్. [ఏడుస్తూ లక్ష్మీపతి దగ్గరికొచ్చి] ఏదో మేనల్లుడననీ మా అమ్మ మాట కాదనలేక నా ఆస్తి మీ చేతిలోపెట్టుకొని, మీ అమ్మాయిని బాగా చదివించి నాకు చదువు అంతగా లేకపోయినా, మాకిద్దరికీ పెళ్లిచేశారు.

లక్ష్మి : [కోపంగా] నోర్ముయ్!

సుబ్బా: [కోపంగా] నన్నే!

లక్ష్మి : [బిగ్గరగా] అవును...

సుబ్బా: [మెల్లగా] మూశాను.

లక్ష్మి : లోపలికి వెళ్లు.

[తల గోక్కుంటూ వెళ్తాడు.]

లక్ష్మి : [విసుగ్గా] అబ్బబ్బ! సరోజా! నా ప్రాణం విసిగించక ... దయచేసి లోపలికెళ్లమ్మా...

సరో : ఏవిటి నాన్నా! నేనంటే అంత యిది.

లక్ష్మి : అంత 'యిది' ఉంది కాబట్టే నీ యిష్టంవచ్చినట్లు ఆటలు సాగుతున్నాయమ్మా... ఏదో తల్లిలేని చిన్న పిల్లవనీ, బెంగతో ఎక్కడ చస్తావోనని తగని గారాబంచేస్తే, నన్నే చంటి పిల్లాడ్ని చేసి నీ యిష్టం వచ్చినట్లు యింట్లో పెత్తనం చలాయిస్తున్నావ్– అనేమాటేదో – అననిమాటేదో తెలీకుండా – పెద్ద వాళ్ల ఎదటగూడా నన్ను అవమాన పరుస్తున్నావ్.

[దగ్గు వస్తుంది. చాలా సేపటివరకూ ఆ దగ్గు తగ్గదు. ఇంట్లోవున్న శాంతమ్మ, గోపి, సుబ్బారావు దగ్గరగావస్తారు – దగ్గు శాంతించిన తర్వాత అలాగే ఆయాసపడుతూవుంటాడు. డాక్టరు స్టెతస్కోపు తీసి చూస్తాడు.]

గోపి : నాన్నా! నాన్నా! [ఏడుస్తూ]

లక్ష్మి : ఆ--గు--బా--బు-- ఆగు.

సరో : [ఆందోళనగా] డాక్టరుగారూ!

డాక్ట : ఆయాసమే కాదు... గుండెకూడా నీరసంగావుంది.

సరో : అయ్యో! ఇప్పుడెలాగ? ఏవిటిచేసేది?

ప్లీడ : ఆ చేసేదేదో డాక్టరుగారే చేస్తారులే అమ్మా! నువ్వూరుకో......

డాక్ట : సరోజా! [పీకిదాని చూపి] అది తీసుకెళ్లి క్లీన్ చేసుకురా!

సరో : [సంశయంతో] నేనా! ఆ! తీస్తా!

శాంత : నేను తీసుకెళతాలే అమ్మా! [తీసుకెల్తుంది]

డాక్ట : సుబ్బారావ్...నాతోరా! [ఆగి] మందు పంపిస్తాను. అదివ్వు సరోజా!

సరో : మీరు రారూ?

డాక్ట : ఎందుకు?

సరో : అదేమిటండి అలా అంటారు?

డాక్ట : నేను కాళీగా కూర్చోడానికి ఇక్కడకు రాలేదమ్మా! నాకింకా పేషంట్సు ఉంటారుగా - సాయంత్రం మరోసారి వస్తాలే -

[డాక్టరు, సుబ్బారావు వెళతారు.]

సరో : [కళ్లనీళ్లతో] నాన్నా! ఎలావుంది?

లక్ష్మి : ఫరవా లేదు.

సరో : ఘోరపాటైంది నాన్నా! మీకు కోపం తెప్పించాను.

లక్ష్మి : ఇందులో కొత్తేముంది...... ఇది అలవాటేగా అమ్మా.

[ఎదురుగా గుమ్మంలోంచి సుందరమ్మ వస్తుంది. సరోజ చూస్తూ----]

సరో : అక్కా!... [ఆలింగనం చేసుకుని] నాన్నా! అక్క వచ్చింది.

[లక్ష్మీపతి లేస్తాడు]

సుంద : ఏం నాన్నా అంత ఆశ్చర్యంగా చూస్తున్నావ్!... ఉత్రం పత్రం వ్రాయకుండా వచ్చాననా! సరోజ నీకు ఒంట్లో బాగోలేనట్లు ఉత్తరం వ్రాసింది. అది

మొన్ననే అందింది. ఆ రోజునుంచి నాకు కంటి మీద కునుకే లేదు. నిన్నే రావాలనుకున్నా.— ఏదీ... ఆయనకు తీరికుంటేగా... 'మా నాన్న ఆరోగ్యం బావుండలేదు. ఒక్కక్షణం యిక్క డుండనని' పోరుపెడితే ఆయనకు ఖాళీలేకపోయినా తీసుకవచ్చాను నాన్నా.

[శాంతమ్మ వచ్చి పీకిదానిపెట్టి వెళుతుంది.]

లక్ష్మి : ఆయనేడీ?

సుంద : ఎక్కడికొస్తేం ఆయనకు తీరికా! స్టాండింగులో దిగేమో లేదో ఆయన్ను పదిమంది చుట్టివేశారు.

లక్ష్మి : ఎందుకూ?

సుంద : స్నేహితులు నాన్నా! అందులో డాక్టర్ రావు గారులేరూ! ఆయన మరీ పట్టుబడితే వెళ్లక తప్పిందికాదు. ఓ! ప్లీ డ రు గా రు యిక్కడే ఉన్నారే!...... నమస్కారమండీ. మా ఆయన మీగురించే ఎప్పుడూ అంటూవుంటారు.

ప్లీడ : ఏమనీ?

సుంద : అబ్బే! మంచివారనీ- ఎక్కువగా మాట్లాడరనీ - ఒక మాట మాట్లాడారంటే ఎంతో అర్థం వుంటుందనీ -

ప్లీడ : అదైతే అబద్ధమే. నేను చేసేది ప్లీడరు వృత్తి. నా మాటలన్నీ కోర్టులోనే ఖర్చు అవుతాయి. ఎక్కువగా

మాట్లాడాలంటే బైట నాకు ఓపిక లేదు. పొర పాటున ఏదన్నా మాట్లాడితే, అపార్థం చేసుకుంటే ఎన్ని అర్థాలన్నా వస్తాయి. అది నాలోప మెట్లా అవుతుంది?

సుంద : [దగ్గరున్న గోపీని మారాత్తుగా చూసి] ఓరి గోపీ! నిన్ను చూడనే లేదురా! [ఎత్తుకుని]

[శాంతమ్మ కాళ్లు కడుక్కోడానికి నీళ్లు తీసుకవస్తుంది.]

బాగున్నావా అమ్మా! [దింపుతుంది]

శాంత : బాగానే ఉన్నానమ్మా.

సుంద : కొత్త చుట్టంలా నీళ్లు యిక్కడెందుకూ – నేనే లోపలికొస్తా పదమ్మా [వెళ్లబోతూ] ప్లీడరుగారూ! వెళ్లిపోకండి... ఇప్పుడే వస్తాను... ఆఁ!... సరూ మీా ఆయనేడీ– – –

సరో : డాక్టరుగారి దగ్గరికెళ్ళారు –

సుంద : ఒక్కసారి యిలా వస్తావా?

గోపి : పెద్దక్కా!

సుంద : ఏం బాబూ!

గోపి : నాకేం తెచ్చావ్?

సుంద : నేనా... నావన్నీ నీవేకదురా! ఆఁ! మరిచాను. బావ తెస్తానని చెప్పేరు.

[సుందరమ్మ, సరోజ వెళతారు]

గోపి : [మొగం ఓట్లించి] అన్నీ అబద్ధాలే...

శాంత : [ముక్కుమీద వేలుపెట్టుకుని] తప్పు.

[ఆమెకూడా వెళుతుంది]

లక్ష్మి : [కుర్చీమీద కూర్చుంటూ] ఊఁ!

[ఆయాసపడతాడు]

ప్లీడ : ఎంత అదృష్టవంతులండీ. కాస్త అనారోగ్యమని తెలియగానే- అమ్మాయి అల్లుడూ వచ్చారంటే ఎంత అభిమానం! ఎంత ప్రేమ!......

లక్ష్మి : [కొంచెం యిష్టంలేకుండా] అవునవును.

ప్లీడ : మీ పెద్దల్లుడికి పనేమిటండీ?

లక్ష్మి : కౌన్సిలర్.

ప్లీడ : అదికాదండీ. సంపాదించే ఉద్యోగమేదన్నా ఉందా అని?

లక్ష్మి : ఉంది --- నోరు.

ప్లీడ : అంటే... అదో కొత్త ఉద్యోగమా?

లక్ష్మి : అదే అనుకుంటా. శరీరంతో కష్టపడనక్కరలేదు. మెదడుతో శ్రమించనక్కరలేదు. ఉన్న ఆస్తి అంతా ఏనాడో తగలేశాడు. నోటి మాటలతో నలుగురినీ కట్టుకున్నాడు. డబ్బు వస్తుందంటే; ఏపని చేయడానికైనా సిద్ధమే- ఎంతకీ, ఎక్కడా డబ్బు చిక్కనప్పుడల్లా నేను కనిపిస్తూవుంటా.

ప్లీడ : ఎందుకూ?

లక్ష్మి : గుమాస్తానడిగి అక్కౌంట్సు ఒకసారి చూడండి...

[సుందరమ్మ మొఖం తుడుచుకుంటూ హడావుడిగా వస్తుంది]

సుంద : ప్లీడరుగారూ! ఆలస్యంచేసాను క్షమించండి.

ప్లీడ : అనుకున్నదానికన్నా తొందరగానే వచ్చారే - ఇందులో ఆలస్యమేమైంది?

లక్ష్మి : అమ్మాయి అల్లుడి దగ్గర కొన్ని పడికట్టు మాటలు నేర్చుకుంది లెండి.

సుంద : ఊరుకో నాన్నా!

[సరోజ గోపి దగ్గరుంటారు]

మర్చిపోయానే! పెట్టె బెడ్డింగు కూలివాడు బైటే పారేసి పోయాడు. ఏం సరూ! కాస్త లోపల పడేయమ్మా!

[శాంతమ్మవచ్చి బెడ్డింగూ పెట్టి తీసుకుంటుంది. సరోజ వెళ్లి ఆ రెండూ లాక్కుంటుంది. అంతా అటు చూస్తారు]

సరో : నాతో చెప్పిన పని యీావిడందు కోవడమెందుకు? ఈ యింటికి పెద్దనౌకర్లం ఆయనా — నేనూ ఉన్నాంగా [కోపంగా లోపలకు వెళుతుంది]

లక్ష్మి : ఊఁ! [అని మూలుగుతాడు]

సుంద : దాని మాటలకేంలే నాన్నా! కోపం ముందూ - అది తర్వాత పుట్టింది. ఎన్నిసార్లు చెప్పినా దానికి జ్ఞానం లేదు. ఏమండీ... మా నాన్న ఆరోగ్యం ఎలావుంది?

ప్లీడ : పొరపాటున నన్ను డాక్టరనుకున్నారేమో......

సుంద : అదేమండీ - అలా మాట్లాడుతారూ... ఇద్దరూ చాలా స్నేహంగా వుంటారు కదా?

ప్లీడ : డాక్టరూ - నేనూనా?

సుంద : నేనేదో మంచిగా మాట్లాడితే......

ప్లీడ : చెడ్డగా నేను సమాధానం చెప్పానా...

సుంద : కాదండీ! మా నాన్నగారూ మీరూ...

ప్లీడ : అయితే ఆయన ఆరోగ్యం గురించి నాకేం తెలుస్తుంది.

సుంద : క్షమించండి... ఇది కోర్టు కాదు.

[లాయరు పచారు చేస్తుంటాడు]

ప్లీడ : ఇది యిల్లా... అయాం సారీ. సుందరమ్మగారూ తమరు లాయరూ, ఇది కోర్టూ, నేను ముద్దాయినీ అని చాలా పొరపడ్డాను సుమండీ...

సుంద : అదేవిటి?

ప్లీడ : లేకపోతే మీరన్నదేమిటి?

లక్ష్మి : ఊఁ!......... [మూలుగుతూ]

[లక్ష్మీపతి మెల్లగా లోనికి వెళతాడు. ఇద్దరూ అటు యిటు చూస్తూవుంటారు. సుందరమ్మ దృష్టి లాయరువైపు మఃలిస్తుంది]

సుంద : ఏమండీ! మీరు నా మాటలు అపార్థం చేసుకున్నారు...... ఏదీ పాపం! నాన్నగారి వయస్సా

మళ్ళింది...అనారోగ్యమూ పెరిగింది... ఈ ఉన్న ఆస్తి......

[లాయరు చురుగ్గా చూస్తాడు. సుందరమ్మ భయపడుతుంది]

సుంద : అలా చూస్తారేం?

ప్లీడ : మామూలుగానే చూశాను.

సుంద : నాకు భయమేసిందండి.

ప్లీడ : ఆ భయానికి కారణం మీ లోపల ఏమన్నా వుందేమో.

[నాగేంద్రం హడావుడిగావచ్చి గుమ్మందగ్గరనుండి వెనక్కి చూస్తాడు]

నాగేం: పోరా ఎందుకట్లా చూస్తావ్! ఒక్కోనీకూడా యివ్వను. వెధవలు...కష్టపడలేక యిదో వృత్తిగా పెట్టుకున్నారు...[లోపలకు చూసి] ఓ! ప్లీడరుగారా! నమస్కారమండీ [చేతిలో గొడుగూ కండువా భార్య కిస్తాడు. ఆమె వెళ్తుంది]

నాగేం: [కూర్చుంటూ] అబ్బబ్బ! ఎక్కడచూసినా వీళ్ల గోలే! ఏమండీ లాయరుగారూ! నాకు తెలీక అడుగుతాను! స్వతంత్రం వచ్చి యింత కాలమైంది... వీళ్ల సమస్యను పరిష్కరించకపోయారంటే...మన ప్రభుత్వం ఎందుకండీ?

ప్లీడ : పెద్దసమస్యే!

నాగేం: అదిరైటే అనుకోండి. అంతర్జాతీయంగా ఇండియా అఖండమైన పేరు గడిస్తుందని పత్రికల్లో అద్భుతంగా రాసేస్తున్నారే -- ఏ దేశంలో లేని యీ అడుక్కునే నీచాన్ని మన దేశంలో ఎందుకు అంతం చేయలేకపోయారూ అని?

ప్లీడ : అవును ఎందుకు అంతం చేయలేకపోయారూ అని.

నాగేం: అంటే?

ప్లీడ : మీరు స్వతంత్ర అభ్యర్థులా?

నాగేం: మీకెందుకు కలిగిందా సంశయం?

ప్లీడ : మీ మాటలనుబట్టి.

నాగేం: నా కర్థంకాలేదు.

ప్లీడ : మీరు కాంగ్రెసు అభ్యర్థిగా కౌన్సిలరయ్యారంటే ఆ ప్రశ్న మీరు అడగరుగా... బహుశా నేనడిగుంటే సక్రమంగా సమాధానం చెప్పిఉండేవారు.

నాగేం: అదిరైటే అనుకోండి.....

ప్లీడ : రైటే కదా. పూరుకోండి.

నాగేం: ఈ ముష్టివాళ్లున్నారు చూశారూ.....

ప్లీడ : చూశాను. వాళ్లు మరీ కానులికీ, అర్ధణాలకూ కక్కుర్తిపడుతున్నారు. కొందరు గౌరవనీయులు అసలే కష్టపడలేక, వేలకీ, లక్షలకీ ప్లానులు వేస్తున్నారు. ఇంతే తేడా.

[నాగేంద్రం మొగం కొస్త మాడుతుంది. లక్ష్మీపతి లోపలి నుండి వస్తాడు. వీధిలోనుండి సుబ్బారావు మందుతో వస్తాడు]

సుబ్బా: [నోరావలించి] అన్నయ్య వచ్చాడే...ఎప్పుడొచ్చావన్నయ్యా!

నాగేం: ఇప్పుడే తమ్ముడూ?

సుబ్బా: వదినెగారేరీ... [లోపలకు వెళ్లబోతాడు]

లక్ష్మి : సుబ్బారావు?

సుబ్బా: మర్చిపోయాను మావయ్యా! యీ మందు...... పూటకి మూడు మోతాదులు వేసుకోమన్నారు. మూడు పూట లొస్తుందన్నారు.

లక్ష్మి : అస లెన్ని మోతాదులు?

సుబ్బా: మూడు.

లక్ష్మి : పూటకు మూడు మోతాదులు వేసుకుంటే మూడు పూట లెలావస్తుంది?

ప్లీడ : మోతాదంటే ఒకసారి అనే అర్థం.

సుబ్బా: [తల గోక్కుంటూ] పజిలయ్యానండీ. [అని మందు తీసుకువెళుతూ]

ప్లీడ : పజిల్సు గొడవలో పడ్డావనుకుంటాను.

సుబ్బా: [కొంతవరకూ వెళ్తూ తిరిగొచ్చి] ఆఁ! జ్ఞాపకంవచ్చింది. లాయరుగారూ. పదవ నెంబరులో బుర్రతక్కువ వాళ్లకు ఒక్కొక్కప్పుడు 'ఇది' కలుగుతుంది అంటూ 'మరపు' 'వెరపు' అన్నాడు. ఏది కరక్టు అంటారు.

ప్లీడ : నీ అనుభవంలో ఏది కరక్టో అదే రాయి.

సుబ్బా: రెండూ కరక్టే.

నాగేం: ఏం! సుబ్బారావ్ నీక్కూడా పట్టిందా యీపిచ్చి!

సుబ్బా: మరే అన్నాయ్! నీలాగ ఓపినింగు క్లోజింగు ఆడటం నా చేతగాదు.

ప్లీడ : ఏమిటది?

సుబ్బా: మా అన్నయ్య బ్రాకెట్టు ఆడతాడులెండి.
[ వెళతాడు ]

నాగేం: లేదు ప్లీడరుగారూ! కౌన్సిలర్ కానిక్రితం ఏదో రెండురోజు లాడేనంతే.

లక్ష్మి : ఇప్పుడు మానేశాడులెండి. అప్పుడప్పుడూ సీజన్లో పట్టణం వెళ్తాడు.

ప్లీడ : ఎందుకు?

లక్ష్మి : రేసెస్ ఆడతాడులెండి.

నాగేం: దానికేంలెండి. అసలు మీ ఆరోగ్యం ఎలావుందండి.

లక్ష్మి : ప్రస్తుతం ఏం భయంలేదు.

గోపి : నీ ఆరోగ్యం ఎలావుంది?...

నాగేం: ఇదేవిటి?

ప్లీడ : నాన్ననంటే నీకు కోపమొచ్చిందిరా గోపీ?

గోపి : నాకు ఏమీ తేలుగాని, ఆరోగ్యంగా వుందా అని అంతా అడుగుతారు.

[ శాంతమ్మ బిస్కట్లు పొట్లం తెస్తుంది ]

శాంత : గోపీ [ యిస్తూ ] ఇంద. [ సుందరమ్మ వస్తుంది. చూస్తుంది ]

గోపి : ఎక్కడిది చిన్నమ్మా [ తీసుకుంటాడు ]

శాంత : పెద్దక్క తెచ్చింది.

గోపి : అబద్ధమాడేవేం. అక్క మంచి బిస్కట్లు తెచ్చింది.
[ వెళతాడు ] [ శాంతమ్మ వెళుతుంది ]

నాగేం: నాతో చెబితే నేను తెచ్చేవాడ్నిగా.

సుంద : అవి మీరు తెచ్చారని నేననుకున్నా!

నాగేం: అవి నువ్వు తెచ్చినవిగావూ?

లక్ష్మి : శాంత తెప్పించి ఉంటుంది.

ప్లీడ : వెళతానండీ లక్ష్మీపతిగారూ.

లక్ష్మి : నేనుకూడా అలా వస్తానండి! నా మనస్సేం బాగా లేదు.

ప్లీడ : ఏమిటి? ఈపరిస్థితుల్లోనా!

లక్ష్మి : పరవాలేదు.

సుంద : ఒంట్లో బాగాలేనప్పుడు వీధిలోకి వెళ్లడమెందుకు నాన్నా!

నాగేం: అవునండి మావగారూ!

లక్ష్మి : కాదండి అల్లుడుగారూ, కాస్త పనుంది. ప్లీడరు గారితో ముఖ్యమైన విషయం మాట్లాడాలి.
[ లక్ష్మీపతి, ప్లీడరు వెళతారు ]

సుంద : చెబితే మనమాట వింటేనా?

నాగేం: మనం రావడం ఆయన కిష్టంలేదేమో?

సుంద : ఊరుకుందురూ, ఏమిటామాటలు.

నాగేం: అది రైటే అనుకో -

[ సరోజ వస్తుంది ]

సరో : నాన్న ఏడీ?

సుంద : ఇప్పుడే అలా బైటికి వెళ్లారు.

సరో : ఎందుకు వెళ్లనిచ్చారు?

నాగేం: మేం వెళ్లనిచ్చేదేమిటీ! ఆయనే వెళితే.

సరో : ఆయన ఆరోగ్యం ఏమీా బావుండలేదు. ఆయనకు పిశాచుల్లా యీా ప్లీడరూా, డాక్టరూా దాపురించారు.

[ శాంతమ్మ మందుతో వస్తుంది ]

శాంత : వారేరీ?

సుంద : బైటకెళ్లారమ్మా!

[ శాంతమ్మ వెళ్లబోతుంది ]

సరో : మాట.

[ శాంతమ్మ తిరుగుతుంది ]

సరో : ఆయనమీాద నీకంత శ్రద్ధ ఎందుకూా?

శాంత : శ్రద్ధేమిటమ్మా! మందు తీసుకొచ్చాను.

సరో : అదే ఎవరు తీసుకరమ్మన్నారు? ఎందుకు తీసుక వచ్చావ్?

శాంత : నేనున్నది పని చేయడానికేగా?

[ సుబ్బారావు వస్తాడు ]

సరో : అంటే దాసీదానవన్నమాట.

సుబ్బా: సరూా!

సరో : మీారు ఊరుకోండి. ఏమంటావ్ ?

శాంత : అలాగన్నా యిబ్బంది లేదు.

సరో : ఈ నీచమైన బ్రతుకు బ్రతికేదానికన్నా ----

శాంత : సరోజా!...మాటలు జాగ్రత్తగా వాడమ్మా!...

సరో : లేకపోతే ఏంచేస్తావ్ ?

శాంత : ఏంచెయ్యను. కాని నీలో ఏమాత్రం మంచిఉన్నా, చెడ్డమాటలవల్ల మలినమౌతుందమ్మా...అందుకే చెప్పాను... [ లోపలకు వెళుతుంది ]

సుబ్బా: మంచిదాన్ని బాధపెట్టడం మంచిదికాదు సరోజా!

సరో : మిమ్మల్ని యిక్కడ ఎవరూ తీర్పుచెప్పమని కోరలా

సుబ్బా: ఈ పజిల్సు గొడవలో, కోరినా చెప్పడానికి నాకు టైమేది? ఆమెను అనడం మంచిదికాదని చెప్పా నంతే. [ పేపరు చూసుకుంటూ వెళతాడు ]

సుంద : సరూ! వయస్సు పెరిగేకొద్దీ మరీ చిన్నపిల్ల వౌతున్నావేమిటే—

సరో : నువ్వు పెద్దగానేవుండు. [ లోనికి వెళ్తుంది ]

నాగేం: సరోజ నీకంటే తెలివైందని నేనిప్పు డనుకుంటున్నాను.

సుంద : అంతేలే --- మీా తెలివి ----

[ లక్ష్మీపతి వీధిలోనుంచి ఒంటరిగా వస్తాడు. గోపి లోపలి నుంచి వస్తాడు ]

గోపి : నాన్నా ! మరే చిన్నమ్మే! ఏడుస్తుంది.

లక్ష్మి : ఎందుకూ? ఎవరన్నా ఏమన్నా అన్నారా?

సుంద : ఎవరన్నా ఏమన్నా అనడానికి ఏంపని నాన్నా!

నాగేం: ఆవిడకి చిన్ననాటి విషయాలు ఏమన్నా జ్ఞాపకం వచ్చాయేమో! విశ్లోకదూ?

లక్ష్మి : [ లోపలికి చూసి ] శాంతా!... శాంతా!...

[ వస్తుంది. కళ్లు కాస్త మలినంగా వుంటాయి ]

శాంత : ఎందుకండీ!

లక్ష్మి : ఏమిటీ కళ్లు అలాఉన్నాయే?

శాంత : అబ్బే ఏవీఁ లేదండి.

లక్ష్మి : సరోజ ఏమన్నా అందా?

శాంత : ఎందుకంటుంది?

లక్ష్మి : ...ఊరికే అడిగేలే...వెళ్లు.

సరో : ఆగు...అబద్ధం ఎందుకు చెప్పావ్?

లక్ష్మి : నీ విషయంలో నిజం చెప్పడం ఆమె కిష్టంలేదులే. వెళ్లు శాంతా!

[ శాంత వెళ్లుతుంది ]

సరో : నాన్నా! నువ్వెన్నిమాటలన్నా పడతాగాని ఆమె ఈ యింట్లో వుండడం నా కిష్టంలేదు.

లక్ష్మి : కారణం?

సరో : ఆమె ఎవరు? ఎందుకుండాలి? ఆమెకూ మనకూ సంబంధమేవిటి?

లక్ష్మి : ఏముంది ? బంధుత్వమే – గోపిగాడి పినతల్లి. వాడు ఆమెదగ్గిర అలవాటుపడ్డాడు ... నీ మాటల్లో అర్థమేవిటి ? ఆమె ఎందుకుండకూడదు ?

సరో : ఉండకూడదు.

లక్ష్మి : నేనుకూడా ఆ మాటంటే నిన్ను

సరో : నాన్నా ! ఇదేమన్నా న్యాయంగావుందా ?

లక్ష్మి : అన్యాయంగానే వుంది. అదే ఆలోచిస్తున్నాను. నువ్వు లోపలికి వెళ్లు.

[ సరోజ వెళుతుంది ]

సుంద : దాని మాటలకేంలే నాన్నా ! తెలీనిపిల్ల ! నీ ఆరోగ్యంకోసం ఇంట్లో ఎవరున్నా, ఎవరూ బాధపడకూడదు.

నాగేం: ఏమండీ ! ఏ మద్రాసన్నా పోయి మంచి సర్జనుకు చూపిస్తే......

సుంద : నాన్నమీద నాన్నకే శ్రద్ధలేదు. ఆయనగురించి మనం ఎంత బాధపడుతున్నామో ఆ భగవంతుడికి తెలుసు.

నాగేం: అది రైటే అనుకో ! ఏదో ఆయన పెద్దవాడు..... పోయేకాలంగానీ...వచ్చేకాలం కాదుగదా.

సుంద : ఏమిటండీ ఆ మాటలూ......

లక్ష్మి : అతను చెప్పిందానిలో అబద్ధమేముంది ?... నిజమే నమ్మా. ఎందుగురించి నా శరీరంమీద శ్రద్ధవహించాలో నా కర్థం కావడంలేదు.

సుంద : అదేమిటి నాన్నా! మేమంతా ఏమయిపోయాం?

లక్ష్మి : ఏమౌతారు!... ఉన్నారు... కాని నాదగ్గర లేరు. మనుషులు నాదగ్గరున్నా మనసులు మీ భర్తల మీద ఉంటాయి...కూడదని నేననను. తప్పకుండా సర్వత్రా భర్తను ఆరాధిస్తూనే వుండాలి భార్య. ఎప్పుడైతే ఒకరికి నేను కన్యాదానం చేశానో ఆనాటినుంచీ మీరు నానుండి వేరయ్యారు. మీ సంసారంలో కలగబోయే సంతానంకోసం, సంపాదించాలనే ఆస్తికోసం కలలుగనే ఆశలతో - ఆనందిస్తూ - ఆవేదనపడుతూఉన్న మీకు... ఈ ముసలి నాన్నపట్ల యింత ఆత్రుత ఎందుకమ్మా?

సుంద : నన్ను పరీక్షిస్తున్నావా నాన్నా?

నాగేం: ఏదో మనల్ని వేరే అర్థంచేసుకుంటున్నట్లున్నారు.

లక్ష్మి : లేదు ... ఉన్నదున్నట్లుగానే అర్థం చేసుకోడానికి ప్రయత్నిస్తున్నాను.

[ శాంతమ్మ మందు తీసుకవచ్చి పెట్టి వెళుతుంది ]

సుంద : [ బాధగా ] నాన్నా ఎవ్వరో మాపై కిట్టనిమాటలు చెప్పి మీ మనసు విరిచారు. ఆ స్తిమీద వాళ్ల కన్నుపడి మాకేమన్నా ధారపోస్తావేమోనని లేని మాటలు కల్పించి చెప్పేరు.

లక్ష్మి : సుందరమ్మా!...

నాగేం: [పెళ్లాంతో] నీకు బుద్ధివుండి ఏడిస్తేగా. వద్దు మొర్రో అని నేనంటే విన్నావూ? పిలవని పేరంటా నికొస్తే ఇలాగే వుంటుంది...మాట్లాడేముందు ప్రతి మాటకూ 'నాన్న! నాన్న!' అంటూ ఓలలాడి పోతావ్...మీ నాన్నకు నీమీద ఎంత అభిమాన ముందో అర్థమైందిగా?...పద. పద. చాల్లే సరోజా! సుబ్బారావ్! మా బెడ్డింగూ పెట్టె ఇలాపడేయండి.

లక్ష్మి : [శాంతంగా] నాగేంద్రం?

నాగేం: చాల్లెండి మర్యాదచేశారూ... మేమూ ఆస్తిమొగం ఎరుగుదుం. మాకూ మానమర్యాద లున్నాయి. మేమూ మా వూళ్లో మనుషుల్లాగే జీవిస్తున్నాం.

[సరోజ సుబ్బారావు సామానులు పట్టుకవస్తారు]

లక్ష్మి : జంతువులుగా జీవిస్తున్నారని నేను అనలేదే!

నాగేం: మర్యాదగా మాట్లాడండి.

లక్ష్మి : అమర్యాదగా నేనేం మాట్లాడేను?

నాగేం: అయితే ఆమె కల్లాగేనేవిటి మీరు సమాధాన మివ్వడం.

లక్ష్మి : ఆమె నన్నాను గాని నిన్నేమి అనలేదుగా?

నాగేం: ఆమెనంటే మటుకు నాకు కాదూ?

లక్ష్మి : ఓహో! ఆ సంగతి నాకు తెలీదులే.

నాగేం: ఇప్పుడైనా తెలుసుకోండి.

లక్ష్మి : ప్రయత్నిస్తాను. [వెనక్కు తిరిగి నిలబడతాడు]

నాగేం: మొద్దులాగ అలాగే కూర్చున్నావేం? పద.

సుంద : చాల్లెండి. ఏమిటా మాటలు.

నాగేం: ఏం!

సుంద : పెద్దవాడు ఆయనేదో అంటే మీరుమాత్రం అంత కంగారు పడ్డమేమిటి? మీకెంత పలుకుబడి ఉంటే మటుకు, మీరు మునిసిపల్ కౌన్సిలర్ అయితే మాత్రం, చైర్‌మెన్ ఏదన్నా మందలిస్తే పడి ఉండరూ?

నాగేం: [తగ్గిపోయి] అది రైటే అనుకో...

సుంద : ముందు కాఫీ తాగండి చల్లారిపోతుంది.

[నాగేంద్రం కాఫీ తాగుతూవుంటాడు. లక్ష్మీపతి మేడ మెట్లవైపు వుంటాడు]

సుంద : నాన్నా! [శాంతమ్మ వచ్చి చూస్తుంది]

లక్ష్మి : అమ్మాయ్! నా అనారోగ్యంవల్ల ఆవేశం వస్తుంది. దానితో అననిమాటేదో అనేమాటేదో తెలీకుండా అనేస్తున్నాను. [ఎదుట తిరిగి] నా బాగు కోరేవాళ్లెవరో బాధ పెట్టేవాళ్లెవరో అర్థం చేసుకోలేక పోతున్నాను-మనస్సు మదనపడినా ఆరోగ్యం మరీ నాశనంచేస్తుంది [ఆయాసంగా] ఏమనుకోవద్దు.

[వెళతాడు]

సరో : నౌకర్లం చాలాసేపటిబట్టి వెయిట్ చేస్తున్నాం. ఈ సామాన్లు...ఎక్స్‌పోర్టా?...ఇంపోర్టా?...

సుంద : ఏమిటీ సరోజా ఆ కోపం?

సరో : కోపం ఏముంది. సామాన్లు పట్టుకరమ్మన్నారుగా!
నా గేం: ఏవరికీ యిష్టంలేనపుడు ఈ యింట్లో ఎందుకే వుండడం? నీకు పిచ్చిగానీ.
సుంద : ఊరుకోండి...సరోజా సామాన్లు లోపల పెట్టెయ్.
సరో : [ బఘాలున పడేస్తుంది ] కావాలంటే మీరు పట్టుకెళ్లండి. [ సుబ్బారావుతో ] మీరుకూడా అవి అక్కడ పారేయండి. [ సుబ్బారావు కోపంతో పడేస్తాడు ]
సరో : లోపలకు వెళ్లండి.
సుబ్బా: లెఫ్ట్, రైట్, లెఫ్ట్, రైట్, లెఫ్ట్. [ అనుకుంటూ వెళ్తాడు ]
[ శాంతమ్మ సామాన్లు లోపలికి తీసుకవెళ్తుంది ]
నా గేం: సరోజకు మనం యిక్కడ వుండడం యిష్టంలేదు.
సుంద : [ చిఱునవ్వుతో ] ఏం సరోజా?
సరో : అవును.
నా గేం: నేనన్నమాట అయిందా! ఇక పద.
సుంద : మీరు వెళ్లిరండి. నేనిక్కడుంటాను.
నా గేం: ఏం!
సుంద : అదేమో చిన్నపిల్ల. దానికి చికాకుగాఉండి మాటలంటే కాస్త ఓపికపడితే మీదేంపోయింది? ఓట్లు కోసం వెళ్లినప్పుడు మిమ్మల్నెందరు ఎన్నిమాటలనలేదు. అన్నిటికీ కోపం తెచ్చుకున్నారా? కోపం తెచ్చుకుంటే మీరు కౌన్సిలరయ్యేవారా!

నాగేం: అది రైటే అనుకో.

సుంద : అయితే ఆ గదిలోకి వెళ్లి కాస్సేపు పడుకోండి.

[ నాగేంద్రం లోపలికి వెళ్లును ]

సుంద : సరోజా ఇలా చూడు!

సరో : ఎందుకూ ?

సుంద : ఈ అక్కమీాద అంత కోపం ఎందుకే?

సరో : నాకేం కోపం?

సుంద : మరెందుకూ సామాన్లు అలా గిరాటేశావ్ ?

సరో : ఎందుకు తెమ్మనాలి ?

సుంద : ఏదో మీా బావ తెలీక......

సరో : ఏదో నేనూ తెలీక...

సుంద : [ నవ్వుతుంది ] నా చెల్లాయికి పిచ్చికోపం. సరూ! నీ వెప్పుడూ యిలావుంటే ఎలాఅమ్మా ?

సరో : ఊరుకో అక్కా. నీ మాటలు బాగానేవుంటాయి గాని అందులో ఉండే అబద్ధాలు చూస్తే నాకు చిరాకుగా వుంటుంది.

సుంద : నేనేమి అబద్ధాలాడేనే!

సరో : మరి నేను వుత్తరం వ్రాయందే వ్రాసానని నాన్న గారితో ఎందుకు చెప్పావ్ ?

సుంద : [ అటు యిటు చూసి ] గట్టిగా అనకే. చూడు...నేను వచ్చినపనేమిటో చెప్పనా ?

సరో : నాకు తెలుసు. అందుకే నాకు కోపం...వచ్చిన పని మనసులో పెట్టుకుని నాన్నగారితో డొంకతిరుగుడుగా మాట్లాడతావేం...... [ శాంతమ్మ వస్తుంది. సరోజ మాటలు మానేస్తుంది. సుందరమ్మ చూస్తుంది. ]

సరో : రహస్యాలు వినడానికి వచ్చావా?

శాంత : లేదమ్మా! [ కాఫీకప్పులు తీసుకుని ] వీటికోసం.

[ లోపలకు వెళుతుంది ]

సుంద : నీ పద్ధతి నాకేం నచ్చలేదు చెల్లాయ్. మనసులో ఉన్నమాట బైటకు అనేస్తే ప్రపంచంలో బ్రతకగలమా?

సరో : ఏం! నేనేమీ చచ్చిపోలేదుగా.

సుంద : ఇది పుట్టిల్లు గనుక నీవన్నమాటలు ఎవరూ తీసికోడంలేదు.

సరో : అత్తిల్లు అయితే?

సుంద : అనుభవిస్తేనేగాని అర్థంగాదు...చూడు చెల్లాయ్! అనవసరంగా మాటలు విడిచిపెట్టకు. ఇప్పుడే మనం నాన్నగారితో మంచిగావుండి ఏదో రాయించుకోకపోతే, ఇక ఆయన పోయింతరువాత...

సరో : అక్కా! అది నీవు అనవలసిన మాటే.

సుంద : కాదు, కాని మనం యిద్దరం అనుకోవచ్చు.

[ డాక్టరు అప్పుడే వచ్చి నిలబడతాడు. ఇద్దరూ కంగారుగా చూస్తారు ]

సుంద : ఓ! డాక్టరుగారా నమస్కారమండి!

డాక్టర్ : [తలవంచి ఎత్తి] నాన్నగారెక్కడ?

సుంద : పైకెళ్లిపోయారు.

డాక్టర్ : [భయంగా] ఆఁ! ఎప్పుడు?

సుంద : అలా అంటారేమిటి? మేడమీది కండి.

డాక్టర్ : అంతేనా!... [వెడతాడు]

సరో : [కోపంగా చూస్తుంది] ఈ డాక్టరొకడు. నేనంటే కళ్లల్లో కారం గొట్టుకుంటాడు.

సుంద : నువ్వంటే ఇష్టంగా వుండేవాళ్లెవరో చెప్పమ్మా?

సరో : ఎవరూలేరు. అంతా అంతే.

సుంద : కారణం?

సరో : అది వాళ్ల పాడుబుద్ధి.

సుంద : కాదు సరోజా! నోరు మంచిదయితే వూరు మంచి దవుతుంది.

సరో : మనసులో విషమున్నా సరే...

సుంద : విషముందో, అమృతముందో మనస్సెవరు చూడొచ్చారు. మాట మృదువుగా వుండాలి. మనిషికి అంతులేని మర్యాదివ్వాలి. అదే పదిమందిచేత మంచ నిపించుకుంటుంది. సరోజా! చూడు నీ వుద్దేశం నాకు తెలుసు.

సరో : ఉన్నదాన్ని ఉన్నట్టుగా చెప్పడమే మంచిదని అసలు నా ఉద్దేశ్యం.

సుంద : మనం ఆడవాళ్లగా పుట్టాం. అది మరిచిపోకు. పైగా యిది హిందూదేశం. ప్రస్తుతంలో ఆ స్త్రీమీద హక్కు మన కేమాత్రం లేదు. భవిష్యత్తులో ఏమో చెప్పలేం - అందుకే అణకువగా వుండి అర్ధించాలి. లేదా దానికి తగిన ఆలోచనలు చేయాలి. ఫలితం కోసం పరులకు తెలియకుండా ఏదన్నా చేయవచ్చు. అంతేగాని అహంభావంతో అధికారముందని అడిగామా, ఆ స్త్రీ యివ్వరు సరికదా అవతల ఉండమంటారు.

[ సరోజ ఆలోచిస్తూంటుంది ]

పుట్టుకతో ఉన్న నీ కోపం ఒక్కసారే తెంచమని నే ననడంలేదు. కాని ఉన్న అభిప్రాయాన్ని ఆలోచన లేకుండా - ఆవేశంలో అన్నావూ... అంతా రసాభాసవుతుంది. ఈ విషయంలో నే చెప్పినట్లు విను. నాకు సహాయపడు. ఎవరూ వినకుండా నన్ను నాలుగు తిట్టినా ఆనందమే... [ చేతులు పట్టుకుని ] ఇదే నా కోరిక చెల్లాయ్.

[ సుబ్బారావు తొందరగా వస్తాడు ]

సుబ్బా : ప్లీడరుగారు రాలేదూ ?

సరో : వచ్చారో లేదో కనిపించడంలేదూ?

సుబ్బా : కనిపిస్తే ఎందుకడుగుతాను !

సరో : పనేమిటో ?

సుబ్బా: కోప్పడతావు కదా!

సుంద : [నవ్వి] నేను కోప్పడనివ్వను లేవోయ్. అదేమిటో చెప్పు.

[శాంతమ్మ మందు తీసుకుని మేడమీది కెళ్తుంది]

సుబ్బా: [సంశయంగా] ఇక లాస్ట్ నెంబరు వదినా! ఇప్పటికి పదిహేను ఎంట్రీలు పూర్తిచేసాను. ఎంత ప్రయాస పడ్డా వచ్చిన నెంబరే వస్తుంది. వదినా! నీ నోటితో ఏది చెబితే అది వ్రాసేస్తాను.

సుంద : ఏమిటి సరూ! [అర్థంగాక]

సరో : ఈ మధ్య ఈయనకు మాయదారి పజిల్సు పిచ్చి పట్టుకుంది లే.

సుబ్బా: ఈమధ్యేవిటి? చాలాకాలంనుంచి వుంది. అయితే నా యింటెరెస్టుకు తగిన పజిల్సు ఏర్పాటు ఇంత వరకూ జరగలేదు. ఏ మహానుభావుడు ఆదిలో ఈ రకమైన పజిల్సు ప్రారంభించాడో ఆయనకు నా హృదయపూర్వకమైన నమస్కారాలు అందజేస్తున్నాను. [సరోజకు దణ్ణం పెడతాడు]

సుంద : ఎదురుగా మా చెల్లెలు.

సుబ్బా: పొరపాటయింది.

సరో : ఈ పజిల్సు పేరుచెప్పి వెయ్యి రూపాయిలు ఆ మహానుభావులకు సమర్పించారు. తిండీ తిప్పలూ సరిగ్గా లేవు. రాత్రింబగళ్లు యిదే గోల.

సుబ్బా: చూడు సరోజా! ఈ దఫా పస్టు ప్రైజు మనదే. అంటే వదినగారూ! ఇరవై వేలు!

సుంద : [ ఆశగా ] ఎవరుకొస్తుంది!

సరో : గెలిచిన వాళ్లకి.

సుంద : అసలు ఒస్తుందన్నమాట!

సరో : మీ ముద్దుల మరదికి చస్తే యీ జన్మలో రాదు.

సుబ్బా: [ ఏడుపు ముఖంతో ] చస్తే యిక వచ్చే దేవిటి? చూశారా వదినగారు! ఎంత ఘోరమైన శాపం పెట్టిందో.

సుంద : నవ్వుతూ అంది లే.

సుబ్బా: ఎక్కడన్నా ఏడుస్తూ అంటారేవిటి? సరూ! ఈ విషయంలో మటుకు శాపం పెట్టావంటే నేను సహించలేను! ఆఁ!

సరో : ఇక అననులెండి.

సుబ్బా: వదినా! మానవజన్మ ఎత్తినది మొదలు సమాప్త మయ్యేవరకూ అంటే చచ్చేవరకూ 'యిది' వీడడం కష్టం. అంటే 'ఆశ' 'ఆకలి' ఏది రైటంటావ్ వదినా? ఆలోచించకుండా వెంటనే చెప్పెయ్యాలి.

సుంద : ఆశ!

సరో : ఆకలి ఎందుక్కాకూడదు?

సుబ్బా: వదినగారు చెప్పింది వేదాక్షరం. [ వెళ్లబోతూ వెనక్కు తిరిగి ] ఆఁ! సరూ! పజిలైతే కష్టపడి పూర్తిచేసాను. మరి డబ్బు కావద్దూ?

సరో : నా దగ్గిర కానీ కూడా లేదు.

సుంద : అదేమిటి పాపం ఇవ్వరాదూ?

సుబ్బా: నా డబ్బు నే నివ్వమంటే నీ కంతిదేమిటి?

సరో : మీకు డబ్బుకూడాను.

సుబ్బా: ఏం! మా అమ్మ చచ్చిపోతూ నా పాతికెకరాలు మావయ్య చేతిలో పెట్టలేదూ!

సరో : అర చేతిలో పాతికెకరాలు ఎక్కడ పట్టాయో.

సుబ్బా: సరూ! ఎంతైనా నీకంత 'యిది' కూడదు. నేనూ మగాడ్నే!

సుంద : [నవ్వి] ఆ డబ్బు నే నిస్తాగాని ప్రైజొస్తే నా కెంతి స్తావ్ మరిదీ.

సుబ్బా: అప్పిచ్చిన పదిరూపాయ లిచ్చేస్తా. వడ్డీ కావాలంటే మరో పది రూపాయలు యిస్తాను.

సుంద : అమ్మా! 'ఆశ' నాకు సగ మిస్తానంటే ఆ పది రూపాయిలు నే నిస్తాను.

సుబ్బా: ఆఁ! సగమే! ఇంకో మాట చెప్పు.

సరో : ఎందుకులే అక్కా నువ్వివ్వడం. నా డ్రాయరులో వుంది వెళ్లి తీసుకోండి.

సుబ్బా: అమ్మో వదినగారి కాశ ఎక్కువే.

సరో : తప్పు అలా అనకూడదు వెళ్లండి.

[సుబ్బారావు వెళ్తాడు]

సుంద : వచ్చిన ప్రైజులో నాకు వాటా పంచాలని కదూ నువ్వే యిస్తున్నావ్.

సరో : నువ్వే నేర్పుతున్న విద్యేగా అక్కా. పదిరూపా యల కెక్కడన్నా పదివే లిస్తారా?

నాగేం: [చికాకుగా] అబ్బబ్బ! ఏమిటి సుందరం పక్క గదిలో పడుకోమన్నావ్. పడుకున్న దగ్గరినుంచి ఒకటే రణగొణ ధ్వని.

[శాంతమ్మ మెట్లమీదినుంచి దిగివస్తుంది]

శాంతమ్మా! ఒక కప్పు కాఫీ తీసుకురామ్మా!

[శాంతమ్మ వెళుతుంది. ముఖం దీనంగావుంది]

నాగేం: ఏమిటీ ఆవిడ మొగం అలావుంది.

సరో : ఎప్పుడూ అంతేగా!

సుంద : కాదు. నాన్న కేదన్నా ఎక్కువగా వుందేమో.

సరో : నీ కెప్పుడూ అదే దృష్టి.

[నాగేంద్రం దగ్గుతూ మేడమీదకు వెళతాడు. శాంతమ్మ కాఫీతో లోపలినుంచి వస్తుంది]

శాంత : మీా ఆయనేరమ్మా?

సుంద : నా కివ్వులే! [తీసుకుంటూ] నాన్న కెలావుంది?

శాంత : కాస్త ఆయాసంగా వుంది.

సుంద : ఫరవాలేదనుకుంటాను.

శాంత : భగవంతుడి దయవల్ల ఆయన కిప్పట్లో ఏం భయం లేదమ్మా! [లోపలికి వెళుతుంది]

సరో : ఆయనంటే ఎందుకో అంత అభిమానం ?

సుంద : ఆస్తి వుందిగా...పాపం! ఆశ...

[ నాగేంద్రం కంగారుగా వస్తాడు ]

నాగేం: సుబ్బారావెక్కడ ? సుబ్బారావ్ ?

సుంద : ఏం జరిగిందండి ?

సరో : ఏం కావాలి ?

నాగేం: గుండె చాలా నీరసంగా వుందట...తొందరగా ఒక ఇంజక్షన్ పట్టుకురావాలి.

[ లోపలనుంచి సుబ్బారావు వస్తాడు ]

ఈ చీటీ తీసుకుపోయి ఒక ఇంజక్షను కొనుక్కురా.

సుబ్బా: ఎంత ఖరీదుంటుంది ?

నాగేం: పది రూపాయిలు.

సుబ్బా: డబ్బేదీ ?

నాగేం: ఆమాత్రం దగ్గిర లేదూ! తీసుకురావోయ్ పోయి.
[ వెళతాడు ]

సుబ్బా: ఒదినా! [ అంతా వెళతారు ]

[ సుబ్బారావు వీధిలోకి వెళ్లబోతాడు. శాంతమ్మ వస్తుంది ]

శాంత : ఇదిగో బాబు డబ్బు.

[ చూసి తీసుకుని వెళ్తాడు. శాంతమ్మ కళ్లనీళ్లతో పైకి వెళ్ల బోతుంది ] [ లోపలనుంచి గోపి ] చిన్నమ్మా! చిన్నమ్మా! [ అంటూ వస్తాడు ]

శాంత : రా బాబూ! [ భయంగా దగ్గరకు తీసుకుంటుంది ]

[ పైనుంచి సుందరమ్మ, సరోజ లిద్దరూ ]

నాన్నా! నాన్నా! [ అని కంగారుగా పిలుస్తారు ]

[ శాంతమ్మ కంగారుగా కళ్ల నీళ్లు పెట్టుకుని అటు యిటు చూస్తుంది ]

గోపి : ఏం చిన్నమ్మా! ఏడుస్తున్నావేం ?

శాంత : [ కళ్లు తుడుచుకుని ] లేదు బాబూ - ఏం లేదు.

గోపి : నాన్న కెలాగుంది ?

శాంత : [ ఆత్రుతగా ] ఆయన కేం ఫరవా లేదు. తప్పకుండా ఆరోగ్యంగా ఉంటారు. దేవుడు ఆయన్ని చల్లగా చూస్తాడు......

[ మాటలువింటూ లాయరు వస్తాడు ]

లాయ : ఏమిటమ్మా అది ?...

శాంత : [ కంగారుపడుతుంది. తమాయించుకుంటుంది ] వారికి ఎక్కువగా వుంది.

[ డాక్టరు పైనుంచి మెల్లగా వస్తాడు. అంతా ఒకరికొకరుగా వెనకాల వస్తారు. లాయర్ పైకి వెళతాడు. డాక్టరు కేసి అంతా భయంగా, ఆశ్చర్యంగా చూస్తారు. డాక్టరు ఆలోచిస్తూ పచారు చేస్తుంటాడు. ]

నాగేం: ఏమండి! ఏం భయంలేదుకదా!

సరో : మాట్లాడరేమండి ?

సుంద : మీ రలావుంటే మాకు భయంగావుందండీ.

నాగేం: ఈవేళ మాట దక్కేనా!

సుంద : ప్లీడరుగారుకూడా వచ్చారు...ఏమన్నా రాయిస్తే...

డాక్టర్ : రాసినా లాభం ఏమీా లేదు.

సరో : [ఏడుస్తూ] నాన్నా!

డాక్టర్ : నూ్సా!...ఆయనకు ప్రస్తుతం ఏం భయంలేదు. ఆయన కంఠంలో ప్రాణముండగా రాతకోతలకు ఆయన ఇష్టపడడు. ఆయనకు గాలి మార్పు కావాలి. అందుచేత రేపు నీలగిరి ప్రయాణముంది. ఆయనతో బాటు నేనుకూడా వెళుతున్నాను.

[ఇంజక్షనుతో సుబ్బారావ్, తిరిగి వచ్చిన లాయరు-ఆశ్చర్యంగా చూస్తూవుంటారు. లైట్లన్నీ ఆరిపోతాయి.]

[లైట్లు ఆరిపోవడం ఒక రాత్రి గడిచినట్లుగా స్ఫురిస్తుంది. మళ్లీ మెల్లగా లైట్లు వెలుగుతాయి. విలువైన ఒక బెడ్డింగు బుట్టతో-సుబ్బారావు బైటకు వెళుతూ వుంటాడు. చిన్న లెదర్ సూటుకేసుతో మెట్లపైనుంచి సరోజ వచ్చి వీధిలోకి వెళుతూవుంటుంది. నాగేంద్రం, సుందరమ్మ పనులు చేసేవాళ్లకు పనులు పురమాయిస్తుంటారు.]

సుంద : ఆమాత్రం దానికి నువ్వు పట్టుకెళ్లాలంటే-వస్తాడుగా!

[సరోజ ఒకసారి చూస్తుంది - వెళ్తుంది.
శాంతమ్మ ఒక మరచెంబుతో వస్తుంది]

నాగేం: ఏవమ్మా! మామగారి శరీరం ఒత్తుతుంది. పైన రెండు తలగడలు వేయకూడదూ?

[గోపి నెత్తిమీద 2 తలగడలతో వస్తాడు]

గోపి : మాకు తెలుసు. నువ్వు చెప్పక్కర లేదు.

[తిరిగి సుబ్బారావు, సరోజ లోనికి వస్తారు. గోపి నెత్తి మీద తలగడలు శాంతమ్మ తీసుకోబోతుంది]

గోపి : నేను పట్టుకొస్తానూ...ఊ!... ఊ!... [ వెళతాడు ]

నాగేం: కుర్రకంక ! జానెడు లేడు. వెధవ కబుర్లు !

[ లక్ష్మీపతి మెట్లమీద కనిపిస్తాడు. సుందరమ్మ నాగేంద్రం చెయ్యి గిల్లుతుంది. ]

నాగేం: అబ్బ ! ఏమిటే ! ఇప్పుడా సరసాలు ! [ చూస్తాడు ] ఓ ! మావగారా ! [ తొందరగా దగ్గరకు వెళ్లి చెయ్యి పట్టుకోబోతాడు ]

లక్ష్మి : అక్కర లేదు......నడవగలను.

నాగేం: అది రైటే అనుకోండి. చేతిలో ఉండడం ఎందుకైనా మంచిదని.

[ శాంతమ్మ గోపితో వస్తుంది ]

సుంద : ఏవమ్మో ! నామాట విని కాస్సేపక్కడ ఆగమ్మా !

[ శాంతమ్మ ఆగిపోతుంది ]

గోపి : ఎందు కాగాలి [ చెయ్యి పట్టుకుని ] రా. చిన్నమ్మా !

లక్ష్మి : ఫరవాలేదు శాంతమ్మా ! లోపలి కెళ్లు.

[ శాంతమ్మ లోపలి కెళుతుంది ]

లక్ష్మి : [ గోపితో ] రా బాబూ ! [ గోపి చంక నెక్కుతాడు ]

గోపి : [ గారాభంగా ] నాన్నా ! నేనూ చిన్నమ్మా కూడా నీతో వస్తాం నాన్నా !

సుంద : నువ్వూ మీ చిన్నమ్మేగాని నేను రాకూడదా గోపీ.

గోపి : రాకూడదు. నువ్వు నీ యింటి కెళ్లిపో.

సుంద : చూడు నాన్నా. తమ్ముడు మాటలు.

నాగేం: నేను చెప్పలేదంటే – మనం రావడం. కనీసం ఆ కుర్రాడికూడా యిష్టంలేదు.

సుంద : ఏమిటీ! కుర్రాడి మాటలకూడా.

[లక్ష్మీపతి కుర్చీడిన్ని దింపుతాడు]

నాగేం: అది రైటే అనుకో. [లక్ష్మీపతి దగ్గరకు వెళ్లి] మావ గారూ మనకి......

లక్ష్మి : ఊఁ! ఎందుకు?

నాగేం: చేబదులు తీసుకున్నాను. ఒక స్నేహితుడిదగ్గర.

లక్ష్మి : ఎంత?

నాగేం: అబ్బే! ఎంత! ఒక వెయ్యి రూపాయిలు. [లక్ష్మీపతి చెక్కు రాస్తుంటాడు]

[సరోజ కోపంగా వస్తుంది]

సరో : ఇలా అయితే ఆయనతో కాపరం చేయలేను నాన్నా!

లక్ష్మి : [పరాకుగా రాస్తూ] మరేం చేద్దామని అనుకుంటు న్నావ్.

సరో : అవేం మాటలు నాన్నా!

లక్ష్మి : నువ్వన్నా మాటే కదమ్మా!

సరో : కాదు నాన్నా! ఆయనకు రోజూ పది, అయిదూ కావాలి.

లక్ష్మి : ఆ మాటలన్నీ ఎందుకు? అసలు నీ కెంత కావాలో చెప్పమ్మా!

సరో : నాకూ్కడా వేయి రూపాయిలు కావాలి! చేతిలో ఒక కానీ కూడా లేదు.

లక్ష్మి : సరే. [ చెక్కు రాస్తుంటాడు ]

సుంద : అన్ని బాధ్యతలు మీ నెత్తిమీద పెట్టుకుంటే ఎలా నాన్నా!

లక్ష్మి : ఏం చేయమంటావ్ ?

సుంద : ట్రాన్స్‌పోర్టు మా ఆయనపేర రాస్తే...

సరో : మా ఆయన చేతులు కడుక్కుంటాడు.

సుంద : ఏమిటి సరూ ఆ కోపం?

నాగేం: మీ ఆయనకు కావాలంటే ఫ్యాక్టరీ...

సుంద : ఊరుకోండి. మీకూ్కడా మతిపోయిందేమిటి? పాపం సుబ్బారావు చిన్నాడు. అతనేం మేనేజమెంటు చేయగలడు?

నాగేం: అది రైటే అనుకో...

సరో : ఇక రాంగేదీ...అక్కా! ఆయనెంత అమాయకుడైనా నేను మాత్రం తెలివితక్కువదాన్ని కానని నువ్వు తెలుసుకో. నాన్నా! వాళ్ల కేదన్నా రాసిస్తే దానికి రెట్టింపు విలువైంది రాసివ్వాలి.

సుంద : ఎందువల్ల ?

సరో : నేను చిన్నదాన్ని కాబట్టి.

సుంద : చిన్నదానివైతే ఆస్తికూడా చిన్నగానే అందుకోవాలి.

సరో : ఇది నీ కొ త్త లా ఏమిటి?

సుంద : నీది పాత లా అనుకుంటాను.

లక్ష్మి : [విసుగ్గా] అబ్బబ్బ! ఎందుకమ్మాయీ తగూలాట.

సుంద : కాదు నాన్నా! చెల్లాయి చెప్పిం దేమన్నా న్యాయంగా వుందా?

సరో : నువ్వు చెప్పింది న్యాయం కాబోలు?

లక్ష్మి : ఇద్దరి ఆలోచనల్లోనూ వీసమెత్తయినా న్యాయం లేదు. నా ఆస్తిలో ఏ భాగం కూడా యిప్పుడు నే నెవ్వరికీ రాసివ్వదలచుకోలేదు.

[ఎవరూ మాట్లాడరు. లక్ష్మీపతి లోనికి చూస్తాడు]

లక్ష్మి : శాంతా! [వస్తుంది]

శాంత : ఎందుకండీ?

లక్ష్మి : అవును. ఎందుకూ? నీకు డబ్బుతో పనేముంది. ఊరికే పిలిచాను. కుఱ్ఱాడి విషయంలో జాగ్రత్తగా చూస్తుండు.

సరో : మేమంతా ఏమయిపోయ్యాం నాన్నా!

సుంద : ఏం నాన్నా! మేమంటే అంత యిష్టం లేకుండా పోయిందే!

లక్ష్మి : ఎవరన్నారమ్మా?

సుంద : మరా మాటేవిటి నాన్నా! తమ్ముడ్ని మేం చూచుకోలేం? ఆవిడతో చెప్పడమేవిటి?

లక్ష్మి : ఇందులో తప్పేముంది. ప్రత్యేకించి ఆవిడ్ని మనింటికి తీసుకురావడంలో ఉద్దేశ్య మేమిటో, గోపిగాడి కోసమేకదూ?...అందుచేత ఆమెతోనే చెప్పాను.

సరో : ఎలాగైనా నాన్నకి......

లక్ష్మి : మీారంటే యిష్టంలేదు......అంతే కదూ?

సరో : అవును.

లక్ష్మి : అక్క అంది. నువ్వూ అంటున్నావ్-ఇష్టం లేకపోవడంవల్లనేగా నిన్ను యింట్లో అట్టిపెట్టుక కూర్చున్నాను. ఇష్టం లేకపోవడంవల్లనేగా మీారు అడిగినపుడల్లా కోరినంత డబ్బు యిస్తున్నాను. ఇష్టం [విరక్తిగా నవ్వుతాడు] దీని అర్ధమేమిటో మీా కింకా పూర్తిగా తెలీదు. ప్రేమగా వున్న ఒక వ్యక్తికి తమ స్వార్ధం ద్వారా నష్టం కలిగించాలనే కోరిక.. స్పష్టంగా పరిణామం పొందుతున్నపుడు తప్పకుండా అయిష్టం కలుగుతుంది. దానివల్ల అపార నష్టం ఆంతరంగికంగా ప్రత్యర్ధులు అనుభవిస్తారు. అయిష్టానికి దగ్గరలోనే విరక్తి వుంటుంది. మళ్లీ విరక్తికీ వైరాగ్యానికీ తేడా వుంది. వేమన చెప్పిన "మనసు విరిగనేని మరి అతకరాదయా" అన్నది అయిష్టంనుంచే ఆవిర్భవించిన ఒక రకమైన అనుభూతి. అది నాలో కలుగకుండా చేయాలంటే మీాలో విశాల భావాలు కావాలి. మమకారాన్ని

పవిత్రంగా పోషించుకోవాలి. అదేనమ్మా నా వుద్దేశం. అర్ధంచేసుకోండి. అర్ధంచేసుక మసలండి.
[ దగ్గు రాబోతూంది. ఆపుకొని కుర్చీలో కూర్చొని ఒగర్చుతూ వుంటాడు. అందరూ దగ్గరగా వస్తారు ]

సుంద : నాన్నా ! మమ్మల్ని అపార్ధం చేసుకున్నావా? నీ ఆరోగ్యం బావుండాలని ప్రతిరోజు భగవంతుడ్ని ప్రార్ధిస్తున్నాను. ఆ ఒక్క ఆశ తప్ప మిగతా ఏ ఆశా లేదు నాన్నా !

లక్ష్మి : అలాగామ్మా !

సరో : [ కళ్ల నీళ్లతో ] అంతే నాన్నా !

లక్ష్మి : సరే ! మీ మాటలు నమ్ముతున్నాను. మీరు దీనికి వ్యతిరేకంగా ఎప్పుడైనా మాటలాడినా నా మనస్సుకు మళ్లీ బాధ కలిగించినా నాకు మీరు దూరమౌతారు.

సరో, సుంద : నాన్నా !

లక్ష్మి : సరేనా !

సరో, సుంద : సరే.

[ డాక్టరు అర్జంటుగా వస్తాడు ]

డాక్ట : ఏమిటండీ ఆలశ్యం ? [ వాచీ చూసి ] మనం బయలు దేరాలి.

లక్ష్మి : ఆc ! వెళదాం. ప్లీడరుగారు ?...

డాక్ట : స్టేషనుకు వచ్చి కలుస్తానన్నారు.

గోపి : [ఏడుస్తూ] నాన్నా! నేనుకూడా వస్తా న్నానా్న

లక్ష్మి : [ఎత్తుకుని] వద్దు నాన్నా! నేను మళ్లీ తొందరగానే వస్తాను...

గోపి : ఎక్కడికి వెళుతున్నావు నాన్నా!

సుంద : తప్పు గోపీ!

గోపి : మీరంతా వచ్చే మా నాన్నని పంపించేస్తున్నారు.

సుంద : చూడు నాన్నా!

[తొందరగా లోపల్నుంచి వస్తాడు సుబ్బారావు]

సుబ్బా: డాక్టరుగారూ! ప్లీడరుగారు రాలా?

డాక్ట : ఏమిటి పని?

సుబ్బా: వారితోనే వెండి!...సాధారణంగా...

సరో : ఆగండి! నాన్నగారు ప్రయాణంమీదుంటే ఏమిటా మాటలు.

[సుబ్బారావు లోనికి వెళతాడు. లక్ష్మీపతి గోపిని దించుతాడు]

లక్ష్మి : వెళ్లు! చిన్నమ్మ దగ్గరుండు.

గోపి : ఊఁ! నేను వెళ్లను. నీతో వస్తాను.

శాంత : గోపీ, ఇలా రా నాయనా!

గోపి : [భయంగా చూస్తూ] నాన్నా!

లక్ష్మి : ఉండు నాన్నా! నేను తొందరగా వస్తాగా!

[శాంతమ్మ గోపిని తీసుకుంటుంది]

గోపి : [ కాళ్లు చేతులు గింజుకుంటూ ] చిన్నమ్మా! మనంకూడా వెళ్లిపోదాం. ఊఁ! ఊఁ! నాన్నా! నాన్నా! నాన్నా!

[ లక్ష్మీపతి వెళుతూ ఆగిపోతాడు. గోపి శాంతమ్మనుండి విడిలించుకుని ]

గోపి : నాన్నా! [ వెళ్లి కౌగిలించుకుంటాడు ]

లక్ష్మి : [ కళ్ల నీళ్లతో ] బాబూ! నా మాట విను. నీకు మంచి బొమ్మలూ, బంతులూ, విమానాలు, కార్లు, అన్నీ తీసుకొస్తా. ఏడవకూడదు. ఇలా చూడు [ కళ్లు తుడిచి ] అక్కలున్నారు. బావ లున్నారు. నిన్నెంతో ప్రేమగా చూస్తారు. నేను మళ్లీ తొందరగానే వచ్చేస్తాగా...శాంతా [ గోపి శాంతమ్మ వడిలో వాలిపోతాడు. లక్ష్మీపతి వెళతాడు ]



## రెండవ రంగం

[ రేడియో మెల్లగా పాడుతూవుంటుంది. నాగేంద్రం రేసెస్ పుస్తకాలు తీసుకుని ఆలోచిస్తూవుంటాడు. సుందరమ్మ నవల చదువుతూ వుంటుంది. మరోచోట సరోజ ఎంబ్రాయిడరీ కుట్టుకుంటూ వుంటుంది. ]

నాగేం: [ సుందరంతో ] రాణీ అంటే నీకు తెలుసా !

సుంద : తెలీకేం ? పేక ముక్కల్లో రాణీ కదూ ? దాన్నే మదాం అంటారు.

సరో : అది కాదక్కా ! బావ ఎలిజిబెత్తు రాణి గురించి చెబుతున్నట్లున్నాడు.

నాగేం: ఏడ్చినట్లేవుంది. [ లేస్తూ ] ఆ రాణి పరుగెత్తుతూ వుంటే విమానానికన్నా ముందు పోతుంది. అంటే అంత స్పీడు.

సుంద : ఆవిడ కాళ్లు అంత పొడుగన్నమాట. ఏ దేశంలో వుందండీ.

నాగేం: మనదేశమేనే. అది ఒక రాజాదగ్గిర పెరుగుతుంది. అది ఫీల్డులో కొచ్చిందంటే విన్ చేసి పారేస్తుంది.

సుంద : [ అర్థంగాక ] ఏమిటి సరూ ! ఈయననేది ?

సరో : [ నవ్వి ] అది గుర్రం పేరక్కా !

సుంద : [ నోరావలించి] రాణీ అంటే గుర్రమా ?

[ శాంతమ్మ గోపీని భుజంమీద ఎత్తుకు వస్తూంది. అంతా అటు చూస్తారు ]

నాగేం: ఏవమ్మా! భుజమెక్కాడేం?

శాంత: నిన్నటి నుంచి యిలాగే ఉన్నాడు. జ్వరం తగిలి నట్లుంది.

సుంద: గోపీ! యిలారా నాయనా!

గోపి: ఊఁ!...ఊఁ!...నేను రాను.

[నాగేంద్రం శరీరంమీద చేయి వేస్తాడు]

నాగేం: శరీరం వేడిగానే ఉందే.

సరో: నాన్నమీద బెంగపడ్డాడేమో.

శాంత: కాస్త వైద్యుణ్ణి పిలుచుకొస్తారూ.

సుంద: ఏమిటమ్మా! నీదంతా ఉపద్రవం. కుర్రాడికేదో కాస్త ఒల్లు వెచ్చగావుంటే అప్పుడే వైద్యుడా!

నాగేం: పైగా యింటి డాక్టరు ఆయనతో ఊరికి వెళ్లారామె.

శాంత: మరొకరికి చూపిస్తే?

నాగేం: ఎందుకమ్మా! లోపలికి తీసుకెళ్లు. సాయంత్రానికి తగ్గిపోతుంది.

[శాంతమ్మ లోపలి కెళుతుంది]

సరో: ఈమెతో మహా గొడవొచ్చింది... వాడికి కాస్త దగ్గొస్తే చాలు డాక్టరు కావాలంటుంది.

సుంద: ఏదో పాపం! అక్కగారి కొడుకుకదూ!

నాగేం: అందులో విడో. ఇప్పట్నించీ యిలా పాకులాడితే నేగా - పెద్దయింతరువాత కాస్త గెంజి పోస్తాడు.

[సుబ్బారావు వీధిలోంచి వస్తాడు ఒక కవరుతో]

సుబ్బా: అన్నయ్యా! వచ్చింది.

సుంద : ఏమిటీ? ప్రైజా!

సరో : ఎన్ని వేలు?

నాగేం: [తీసుకుంటూ] ఏదో వుత్తరంలాగుందే.

సుంద : దానిలోనే రాసుంటుంది. చూడండి.

నాగేం: [చింపి చూస్తాడు]

సరో : ఎంతొచ్చింది బావా!

సుంద : ఏవిటీ నీళ్లు నములుతారు చెప్పండి.

సుబ్బా: అబ్బో! నా డబ్బు కాజేయాలని చూస్తున్నారు మీా రంతా...చస్తే ఒక్క కానీకూడా యివ్వను. చెప్పు అన్నయ్యా!

నాగేం: మావగారి దగ్గరనుంచి. ఆయనకు చాలా ఎక్కువగా వుందట. [అంతా ఆశ్చర్యపోతారు. సరోజ వుత్తరం లాగి చూస్తుంది. పక్కను సుందరమ్మకూడా తలపెట్టి చూస్తుంది]

సుబ్బా: మావగారి ఉత్తరమా! ఏదో మంచి ఛాన్సొచ్చిందనుకున్నా.

సరో : ఏమిటా మాటలు. లోపలికి వెళ్లండి.

సుబ్బా: [తల గోక్కుంటూ] ఎవరి గొడవ వాళ్లది.

[సుబ్బారావు లోపలి కెళతాడు. శాంతమ్మ వస్తుంది]

శాంత : ఏమమ్మా! వారి దగ్గరనుంచి వుత్తరం వచ్చిందా?

[ఎవరూ మాటాడరు]

శాంత : ఏమని వ్రాసారు. వారి ఆరోగ్యం బాగుందా?

[ఎవరూ మాట్లాడరు]

శాంత : [ ఆందోళనగా ] ఏం! ఎవరూ మాట్లాడరేం ? ఏం జరిగింది చెప్పండమ్మా!

సరో : నీ కోరిక ప్రకారం ఏం జరగలేదులే.

శాంత : అంటే ?

సరో : బ్రతికే వున్నారు.

శాంత : నేను కోరేది అదేనమ్మా.

సరో : కాదు...ఆయన మరణం.

శాంత : సరోజా!

సరో : ఆ పని కాస్తా జరిగితే, కుర్రాణ్ణి చంకవేసుకుని పుట్టింటికి పోవచ్చుగా.

శాంత : అక్కడెవరున్నారమ్మా ?

సరో : ఎవరూ లేకపోయినా......కుర్రాడున్నాడుగా... కుర్రాడితోపాటు ఆస్తి వుంటుంది. ఆ ఆశతోనే మా యిల్లు పట్టావ్. కుర్రాడికి మా నాన్నకు మత్తు మందు జల్లి చెప్పినట్లల్లా ఆడిస్తున్నావ్.

సుంద : అమ్మా!

సరో : పరాయింట్లో ఎందుకు పడి తినడమని సిగ్గున్న మనిషివయితే ఎప్పుడో వెళ్లిపోయేదానివి.

సుంద : ఏమిటి సరోజా ఆ మాటలు......ఊరుకో...... [ శాంత దగ్గరకు వచ్చి ] నీ వేమనుకోకమ్మా! ఏదో చిన్నపిల్ల!

శాంత : ఏమనుకోను లేమ్మా! [ లోపలికి వెళుతుంది ]

సుంద : నీ కెన్నిసార్లు చెప్పినా జ్ఞానం లేదేమిటే?... అనని మాటేదో అనే మాటేదో తెలియనక్కర్లా.

సరో : తెలుసుకోవలసినంత పని నాకు లేదు...మనసులో ఒకటి పెట్టుకుని పైకి ఒకటి మాట్లాడ్డం నా చేత గాదు. [ కోపంగా లోపలి కెళుతుంది ]

సుంద : [ వెళ్లే సరోజను చూస్తూ ] అయ్యో, పిచ్చి పిల్ల!

నాగేం: అది పిచ్చిది గాదు. తెలివైందే.

సుంద : ఇదేనేమిటి తెలివి?

నాగేం: కాదుమరీ! ఆ మాటల్లో ఎంతర్థముంది. కోపంగా అంటే మాత్రం ఎంత అందంగా అంది. ఒకోమాట మాటాడుతూవుంటే......

సుంద : చాల్లెద్దురూ మీ శౌగ ర్త. ఇలా మాట్లాడితే కావలసిన పనికూడా గంగపాలౌతుంది. ఆయనకి జబ్బు ఎక్కువగా వుంటే మాత్రం జీవించే ఉన్నారుగా. తిరిగి వచ్చింతరువాత ఈ మాటలు ఆయనకు తెలిస్తే!

నాగేం: తిరిగి వస్తాడంటావా?

సుంద : ఏమో! ఎవరు చెప్పగలరు? మీరు ఊరికే దాన్ని సమర్థిస్తున్నారు. ఆ మాత్రం ఆలోచనక్కర్లా. కౌన్సిలరు కూడాను......

నాగేం: అది రైటే అనుకో. [ రహస్యంగా ] ఆ శాంతమ్మ యిక్కడనుంచి వెళ్లిపోవడమే మంచిదంటాను.

సుంద : తలచినప్పుడే తాతపెళ్లంటారేమిటి? పంపించేది మర్యాదగానే పంపిద్దాం.

నాగేం: వినకపోతే?

సుంద : అప్పుడు సరోజే వుందిగా.

[ ప్లీడరు వస్తాడు ]

నాగేం: ఓ! ప్లీడరుగారా! దయచేయండి! దయచేయండి.

ప్లీడ : [ ఆగి అనుమానంగా ] ఎటు? లోపలికా? బైటకా?

నాగేం: [ కుర్చీ చూపుతూ ] లోపలికండి.

సుంద : ప్లీడరుగారు చాలా చిత్రంగా మాట్లాడుతారులెండి.

ప్లీడ : ఇదొక అభాండం.

సుంద : మరి మా ఆయన ఏదో అంటే మీరలా సమాధానం చెప్తారేం?

ప్లీడ : మీ ఆయన సదుద్దేశంతోనే ఆహ్వానించి వుండొచ్చును. మీ నాన్నగారింట్లో లేరుగా. అందుచేత దయచేయండంటున్నాడేమో అనుకున్నాను.

[ శాంతమ్మ కాఫీ తీసుకవచ్చి అక్కడ పెడుతుంది ]

ప్లీడ : ఏవమ్మా! ఏమన్నా జాబొచ్చిందా?

శాంత : వారి నడగండి. [ వెళ్తుంది ]

సుంద : వచ్చిందండీ. కాని...

ప్లీడ : ఏమిటీ సంశయం.

సుంద : కాస్త ఎక్కువగా వుందని వచ్చిందండి.

ప్లీడ : కాస్తే కదా! అయితే ఫరవాలేదు.

నాగేం: అది రైటే అనుకోండి. ఎట్లాగైనా కూతురుగదా?

ప్లీడ : అవును పాపం! అందుకే చాలా విచారంగా కనిపిస్తున్నారు.

[ సుబ్బారావు ఆత్రంగా వస్తాడు ]

సుబ్బా: అమ్మయ్య! వచ్చారా! ప్లీడరుగారూ చూశారూ- ఆస్తిపరుడైన వ్యక్తిని బంధువులు డేమ్ ఏంకోర్తారు? అంటే 'చావు' 'బ్రతుకు' ఏది కరెక్టంటారు?

[ సరోజ వచ్చి వింటుంది ]

సరో : మీకు జ్ఞానం లేదు? ఎప్పుడు చూసినా యిదేనా గోల.

సుబ్బా: సరోజా! ఎంత చెడ్డా నేను మగవాడ్ని. నలుగురి ఎదుటా నన్ను 'ఇన్‌సల్టు' చేస్తే సహించలేను తెలుసా?

సరో : తెలుసు. ఇక లోపలికి దయచేయండి.

సుబ్బా: వెళ్లకపోతే?

సరో : అంతవరకూ వచ్చిందీ.

సుబ్బా: రాకేం జేస్తుంది. నే నేం లేనివాడ్నిగాను. నాకూ 25 ఎకరాలుంది. నీ కిదుగో ఫస్టు వార్నింగు యిస్తున్నా - ఇక నాపై అజమాయిషీ చేసావంటే నేను సహించను. [ వెళ్లబోతూ ఆగి ] ఏది కరక్టంటారు ప్లీడరుగారూ?

ప్లీడ : చావు.

సుబ్బా: ఎవరు ?

ప్లీడ : నిన్ను కాదోయ్! దానిలో వాక్యం.

సుబ్బా: ఓహో! అదా! అయితే కరక్టే. [వెళ్తాడు]

సరో : అబ్బబ్బ! ఈయనతో మహా చెడ్డగొడవొచ్చిందండి.

ప్లీడ : సరోజా! అతను నీకు భర్తనేది మరిచిపోవద్దు.

సరో : అందుకేగా ఏమండీ అని పిలుస్తున్నాను.

ప్లీడ : అదేనా భర్త కోరేది ?

సరో : ఇలాంటి భర్తకు అంతకన్నా గౌరవ మిచ్చే ఆడ దెవరు ?

నాగేం: అది రైటే అనుకో. అందరి ఎదుటా అలా అనడం మంచిదికాదు సరోజా!

సరో : చాటు మాటుగా అనడం నా చేతగాదు ?

నాగేం: మీ అక్కదగ్గిర నేర్చుకోకూడదూ ?

సుంద : గొప్ప సలహాలే ఊరుకోండి. పెద్దవారొచ్చారు, మంచీ చెడ్డా మాట్లాడకుండా ఏమిటీ గొడవ ? సరోజా కూర్చో! ప్లీడరుగారూ! మా నాన్న గురించి మీ రేమాలోచించారు ?

ప్లీడ : ఆయన గురించి నే నాలోచించే దేమిటి ?

సుంద : కాదండి. ఆయన ఆరోగ్యం బాగుండలేదు కదా ?

ప్లీడ : అవును.

సుంద : అందుచేత ?

ప్లీడ : ఆఁ!

సరో : ఏమిటక్కా మాటలు? చెప్పేదేదో ప్లెయిన్‌గా చెప్పాలిగాని. ఆ డొంకతిరుగుడేమిటి? కాదు ప్లీడరు గారూ! నాన్నగారికి చాలా ఆస్తివుంది. మేము ఆడపిల్లలం. ఆయన బ్రతికుండగనే చెల్లో కాస్త రాసిస్తే బాగుండేదికదా అని అక్క అభిప్రాయం.

ప్లీడ : నిజమే బాగానే వుండేది!

సరో : ఆయనతో ఆ మాట లంటేనే కోపమొస్తుంది. మే మేంచేసేది చెప్పండి?

ప్లీడ : అవును పాపం!

నాగేం: నిజంగా వీళ్లిద్దరూ ఆడపిల్ల లయ్యారు గాబట్టి సరిపో యింది గాని, వీళ్లే మగాళ్లయితే ముక్కుమీద గుద్ది మూడోవంతు వాటా ఒక్కొక్కళ్లూ తీసుకో పోదురా చెప్పండి.

ప్లీడ : అది రైటే అనుకోండి.

నాగేం: ఆఁ!

ప్లీడ : వాళ్లిద్దరూ మగవాళ్లైతే మీ రాడవాళ్లైతే ఈ గొడవే రాకపోయేది? కాని అలా జరగనందుకే యిప్పుడు మన మంతా బాధపడుతున్నాం. నాగేంద్రంగారూ! మీ తోబుట్టువు లెవరైనా వున్నారా?

నాగేం: లేకేం! ముగ్గురున్నారు.

ప్లీడ : మగవాళ్లు?

నాగేం: ఇద్దరు.

ప్లీడ : మీ వాటా కొచ్చిన ఆస్తి?

నాగేం: యాభై యకరాలు.

ప్లీడ : ఆడబిడ్డల కెన్ని ఎకరా లిచ్చారు?

నాగేం: ఇచ్చామనుకోండి.

ప్లీడ : ఎంత?

నాగేం: ఒక్కో-పిల్లకు 5000 రూపాయల కట్నం.

ప్లీడ : ఇంతకేనా మీ మావగారు మీ కిచ్చిన కట్నమెంత?

నాగేం: అది రైటే అనుకోండి......

ప్లీడ : అడిగిన దానికే సమాధానం చెప్పండి.

సుంద : ఏమిటండీ ప్లీడరుగారూ ఇప్పు డెందుకు చెప్పండి!

ప్లీడ : కావాలమ్మా!

నాగేం: పదివేలు.

ప్లీడ : అప్పుడప్పుడూ మీరు తీసుకున్నది?

సరో : ముప్పై వేలవరకూ వుంటుంది.

నాగేం: అబద్ధం.

ప్లీడ : పోనీ యిరవై వేలుంటాయా?

నాగేం: ఉంటుందనుకోండి కాని...

సుంద : యిప్పుడా గొడవెందుకులెండి? అసలు మా నాన్న రెండో పెళ్లి చేసుకోవడంవల్లనే ఇంత గొడవా

వచ్చింది. లేకపోతే న్యాయంగా ఈ ఆస్థంతా మా యిద్దరిదీ కదండి?

సరో : ఎవరిద్దరిదీని?

సుంద : మనిద్దరిదీనే.

[ శాంతమ్మ విచారంగా వస్తుంది ]

ప్లీడ : ఏవమ్మా అలా వున్నావే?

శాంత : గోపీకి జ్వరం ఎక్కువగా వుందండి. [ వెళ్లిపోతూంది ]

[ అందరికేసి చూస్తాడు ప్లీడరు ]

నాగేం: ఆఁ! ఈవిడిదంతా పెద్ద యిది. ఏమీ లేదు ప్లీడరు గారూ! వాళ్ల నాన్నమీద బెంగవల్ల ఒల్లు వెచ్చబడిందంతే.

ప్లీడ : పోనీ మందేమన్నా తీసుకురాలేక పోయారా?

సుంద : వీరిని పంపిద్దామనుకున్నామండి, అంతలో మీరొచ్చారు?

ప్లీడ : నేను రావడంవల్లే ఆగిపోయారా? అయితే నేను వెళ్తాను.

నాగేం: అబ్బెబ్బె! కూర్చోండి. [ వెలుపలనుంచి 'పోస్టు' అని పిలుపు. నాగేంద్రం బైటకు వెళతాడు. అంతా అటు చూస్తూ వుంటారు. లోపలినుంచి సుబ్బారావు వస్తాడు. చిన్న లెటరుతో నాగేంద్రం వస్తాడు తిరిగి ]

సుబ్బా: ఎవరితో చెప్పకు. ముందు నాతో చెప్పు.

ప్లీడ : ఏమిటది?

సుబ్బా: మనకు ఫస్టు ప్రైజు వచ్చి వుంటుంది.

నాగేం: మావగారికి చాలా సీరియస్‌గా వుందట.

సరో : సుంద : ఆఁ!

సుబ్బా: [నవ్వుతాడు]

ప్లీడ : విచారించవలసిన టైములో నవ్వుతా లేమిటోయ్!

సుబ్బా: నేను పైకి నవ్వానులెండి. మా అన్నయ్య లోపల నవ్వుకుంటున్నాడు.

నాగేం: నోర్ముయ్!.

సుబ్బా: 'షటప్'. అని దానిని ఇంగ్లీషు అంటే అందంగా ఉంటుందన్నయ్యా!

సరో : మా నాన్నగారికి జబ్బెక్కువగా వుందని మేం కంగారు పడుతూంటే ఏమిటా హాస్యం? లోపలికి వెళ్లండి.

సుబ్బా: అబ్బబ్బ! ఎంత కంగారు పడిపోతున్నారు. ప్లీడరు గారూ నిజంగా వీళ్లు......

సరో : బుద్ధుందా లేదా?

సుబ్బా: నీకా? నాకా?

సుంద : ఏవిటే ఆ మాటలు? సుబ్బారావ్, నా మాట విను బాబూ! నువ్వు లోపలికెళ్లు.

సుబ్బా: ఏం వదినా? ఆడవాళ్లు మీరు హాల్లో కూర్చొని నన్ను లోపలి కెళ్లమంటారు, ఏమన్నా న్యాయంగా వుందా?

సుంద : ఆఁ!...ఏమీలేదు. ఏవో పజిల్సు రాసుకుంటూ వుంటావు కదూ? అందుకు.

సుబ్బా: ఇదిగో సరోజా! నీ ఆటలు యింకెంతో కాలం కాదు. నేను తప్పకుండా ఫస్ట్ ప్రైజు కొట్టాను. ఇప్పుడే పోస్టాఫీసు దగ్గిరి కెళ్తున్నా. వైరొస్తుంది. తక్షణం నిన్ను మా యింటికి ప్రయాణం చేయించుతాను. తెలుసా! ఆఁ! [వెళతాడు]

సరో : మీ యింటి కొచ్చేవాళ్లెవరో?

ప్లీడ : పాపం! అమాయకుడు.

సరో : అనుకునేవాళ్లు అమాయకులు.

ప్లీడ : అంత తెలివైనవాడా? అవునులే అతనిగురించి నీకు తెలిసినంతగా మాకేం తెలుస్తుంది. [లోపలికి చూసి] శాంతమ్మా!

శాంత : [వస్తుంది]

ప్లీడ : గోపీకి ఏమన్నా తగ్గినట్టా.

శాంత : ఇంకా ఏం తగ్గలేదండి. జ్వరం ఎక్కువౌతూన్నట్టుంది.

ప్లీడ : నేనే వెళ్లి డాక్టరును పిలుచుకవస్తాను లేమ్మా!

శాంత : [వెళ్తుంది]

నాగేం: అదేమిటండీ. నేను లేనూ!

ప్లీడ : ఎవరన్నారు?...ఉన్నారు.

నాగేం: కాదండి. డాక్టరుని పిలుచుకు రావడానికి.

ప్లీడ : అయితేఁ! వెళ్లలేదేం?

నాగేం: మీ రున్నారని.

ప్లీడ : నేనుంటే మీా రెళ్ళడానికి అడ్డేమిటి?

నాగేం: అది రైటే అనుకోండి.

ప్లీడ : రైటేకదా! అయితే వెంటనే వెళ్ళండి?

నాగేం: వెళ్తున్నాగా? [వెళ్తాడు]

సరో : ఈయన కౌన్సిలరు ఎట్లా అయ్యాడక్కా?

సుంద : ఓట్లు వేయడంవల్ల.

ప్లీడ : బహుశా అవి కొనుక్కున్న వోట్లయి వుంటాయని. అంటే చాలా విలువైనవన్నమాట. అదేనా నీ అనుమానం సరోజా!

సరో : ఆ డబ్బు మా నాన్న దగ్గిరనుంచి పట్టుకెళ్లిందేగా?

సుంద : నీ కొక్కదానికే నాన్న. నాకు కాదూ?

సరో : నీకొక్కవచ్చు. మీా ఆయనకు హక్కేమిటి?

సుంద : నానుంచి వచ్చిందే. ఇంత తెలివిగా మాట్లాడుతున్నావుగాని పిచ్చిచెల్లీ. మీా ఆయన తినే తిండంతా ఎక్కడిది?

సరో : మీా ఆయనదా?

సుంద : కాదు. మా నాయనది. ఇదిగో సరోజా! 'కోపంగా మాట్లాడటమంటే నాకు చాలా అసహ్యం' అయినా మా ఆయనను అవమానించేటట్టు మాట్లాడితే మట్టుకు నే నూరుకోను. మా ఆయనకున్న పలుకుబడి, ఆయనకున్న పేరుప్రతిష్టలూ, మీా ఆయన ఎన్ని జన్మాలెత్తితే వస్తుందే? ఎంత తపస్సు చేస్తే

వస్తుందే? ఏమండీ ప్లీడరుగారూ! మీరు చెప్పండి.

ప్లీడ : ఔ నౌను.

సరో : ఏం ఔనండి! మీరుకూడా మహా చక్కగా మాట్లాడుతున్నారు.

ప్లీడ : అబ్బే! లేదు! లేదు!

సరో : అక్షరంముక్క రాని మగణ్ని బెట్టుకుని, నోరు పెట్టుకు బ్రతికే ఆయన్ని పెట్టుకుని మా ఆయనంత గొప్పోడు లేడని నేనేం కోతలు కోయడంలేదు.

సుంద : చూశారా! ప్లీడరుగారూ!

ప్లీడ : వింటున్నానమ్మా! వింటున్నాను.

సుంద : పెద్దా చిన్నా లేకుండా ఎంతెంత మాటలంటుందో వింటున్నారుకదూ! ఏదో చెల్లెలు కదా అని మన సుండబట్టలేక మంచిమార్గాన్ని పెడదామని ఎన్ని పాట్లుబడ్డా......

సరో : నాలో చెడ్డ వుంటేగా నీవు మంచి మార్గములో పెట్టడానికి?

[ ప్లీడరు వెళ్లబోతాడు ]

సుంద : ప్లీడరుగారూ! ఏమిటి అర్జంటుగా వెళ్లిపోతున్నారు?

ప్లీడ : మీ తగూలాటలో నేనెందుకు?

సుంద : ఫీజు యిచ్చుకోలేమనా?

ప్లీడ : వాదికీ ప్రతివాదికీ ఒకే ప్లీడరు ఎలా వుంటాడు?

సరో : మరొకరిని పిలుచుకురాడానికి వెళ్తున్నారా?

ప్లీడ : కాదమ్మా! నా వృత్తికి భంగం ఏర్పడకుండా వుండ డానికి.

సరో : అంటే?

ప్లీడ : రేప్రొద్దున్న క్రిమినలు కోర్టుకు మీా రిద్దరూ కలిసి నన్నే సాక్షిగా యీడ్చుకు పోతే?

సుంద : ఏమిటి ప్లీడరుగారూ! అలా మాట్లాడుతారు?

సరో : మేమంత విధం చెడి సభ్యత లేకుండా జుట్టూ జుట్టూ పట్టుకునేవాళ్ల మనుకుంటున్నారా?

ప్లీడ : అంతవరకైతే ఫరవాలేదు. యింకా శృతిమించితే......

సుంద : ఏమిటది?

ప్లీడ : [వైరు కాగితం చూపుతూ] ఇది మీాలాంటి చదువుకున్నవాళ్లు, సర్వం తెలుసునని గర్వపడేవాళ్లు, సభ్యత గలవాళ్ల మని ఆత్మసంతృప్తి పడే వాళ్లు, చేయవలసిన పనేనాయిది. ఇది ఏలాంటి సమయం? అనారోగ్యంవల్ల బాధపడి ఆరోగ్యంకోసం అన్య ప్రదేశాలకు పోయిన కన్నతండ్రి చావు బ్రతుకుల మీాదున్నాడని వైరొస్తే, సానుభూతిగా 'పాపం' అన్న పాపాన పోలేదు సరికదా, పగవాడు, పనికి రానివాడు పోతే పోయాడులే...పదివే లనుకునే పద్ధతిలో మీారు ప్రవర్తించడం చూస్తే నాకు బాధ కలిగి బాధ్యత తెలియని మనుషులమధ్య

బ్రతకడం కష్టమనే భయంతో పరారవుతున్నాను. అది......

సుంద : ప్లీడరుగారు. క్షమించండి. ఏదో మీకన్నా చిన్న వాళ్లం. తెలియని ఆడపిల్లలం. నిజంగా నాన్న విషయం తలుచుకుంటే గుండెలు తరుక్కుపోతున్నై. కాని ఏంచేయం చెప్పండి. [కన్నీళ్లతో] మాకు దారి తెన్నూ కనిపించడంలేదు.

సరో : అవును ప్లీడరుగారూ! ఏదన్నా ఒక మార్గం ఆలోచించండి. నాన్నకు నేనంటే ఎంతో ప్రేమ. అందుకే నాకు పెళ్లిచేసి కూడా యింట్లో అట్టిపెట్టుకున్నారు.

సుంద : ఆ పక్షపాతం నాన్నగారి కెప్పుడూ లేదండి. ఒక విధంగా నేనంటేనే ఆయన కభిమానం హెచ్చు. ఆ ఫ్యాక్టరీ, ఆ ట్రాన్స్పోర్టు మావారి కివ్వాలనే ఆయన వుద్దేశ్యం.

సరో : నీతో చెప్పారా?

సుంద : నామీదకన్నా, నీమీదే ప్రేమ ఎక్కువుందని నీతో చెప్పార్లా?

సరో : చెప్పాలా ఏమిటి? ఆయన చేష్టలు తెలీయడంలా! మా ఆయన, ఆయనకి స్వయానా అక్కగారి కొడుకు.

సుంద : అందుకే ఎందుకూ కొఱగానివాడని యింట్లో పెట్టు కున్నాడు.

సరో : కాదు. తెలివైనవాడనీ, మీ ఆయనలా జులాయిగా తిరిగి డబ్బు పాడుచేయడనీ, ఆయన తదనంతరం ఆస్తినంతా, మా ఆయనకిస్తే, నమ్మకంగా ఆ కుర్రాడికి దక్కుతుందనీ, నన్నూ మా ఆయన్ని యింట్లో పెట్టుకున్నారు.

సుంద : చూశారా! ప్లీడరుగారూ!

ప్లీడ : అబ్బే! వింటున్నాను. వింటున్నాను.

సుంద : మా ఆయన పేరు ప్రఖ్యాతులు నీకేం తెలుసే! ఆయన మున్సిపలు కౌన్సిలరు.

సరో : మా ఆయనా కూడా డబ్బు తగలేసి నిలబడితే కౌన్సిలర్ కాదు చైర్మెన్ అయ్యేవారు. ఏమండీ ప్లీడరుగారు! మీరు చెప్పండి? న్యాయంగా యీ ఆస్తిలో కొంత భాగం మాకు దక్కదంటారా?

సుంద : నీకు కొంత భాగం కావచ్చు. పూర్తి అధికారం మా ఆయనే తీసుకుంటారు.

సరో : నేనూ అది చూస్తాగా! ఎంతవరకూ అధికారం తీసుకుంటాడో.

సుంద : నువ్వు చూస్తూ వుంటే, మా ఆయన అధికారం చేస్తూవుంటాడు.

ప్లీడ : ఎప్పటి నుంచమ్మా!

సుంద : మా నాన్నగారూ......
ప్లీడ : కానివ్వండి 'హరీ' అన్న తరువాత. అంతేనా.
సుంద : ఎంతమాట! మా కా వుద్దేశ్యం లేదండి.
ప్లీడ : లేకుండా ఈ దురుద్దేశ్యానికి కారణం?
సుంద : ఏమండీ, ఎటుతిరిగి ఎటొస్తుందో మనం చెప్పలేం కదా? అందుకు?
ప్లీడ : ముందే ఆలోచించడం మంచిదంటావు ఏం సరోజా!
సరో : అవునండి.
ప్లీడ : అయితే యికనేం. అలాగే చేద్దాం. ముందులో మీా రిద్దరూ ఒక నిర్ణయానికి రావాలికదా?
సుంద : మాలో మేం ఏదో ఒక నిర్ణయానికి వస్తాంలేండి. దానికి మార్గం ఏమిటో చెప్పండి.
సరో : అలా వీల్లేదు. వీళ్లాయన శుద్ధ రాడీ. అందుచేత ముందే రాతకోతలు గావాలి.
సుంద : సరోజా! నీ వెంత చెల్లెలివైనా ఆయన నలా దూషిస్తే నే నూరుకోలేను.
సరో : అయితే నా మాట ప్రకారం జరగనీయ్!
సుంద : సరే, అదేమిటో నీవే చెప్పు!
సరో : ట్రాన్స్పోర్టు నీకు, ఫ్యాక్టరీ నాకు.
సుంద : బాగానేవుంది. ఆస్తి.
సరో : ఇద్దరం చెరిసగం తీసుకుందాం.

సుంద : ప్లీడరుగారూ! యేదో చిన్నపిల్ల కోరింది. అలాగే చేద్దాం.

ప్లీడ : బ్యాంకులో క్యాష్?

సరో : అది నాదే.

సుంద : అదుగో చెల్లాయ్?

సరో : ఒక్క కానీకూడా నీ కివ్వను.

సుంద : చూశారా! ప్లీడరుగారు. ఇది నా చెల్లిలని చిన్న తనంనుంచీ ఎంతో ప్రేమగా చూసుకుంటే నన్ను అన్యాయం చేయడానికి చూస్తుంది. బావుందం టారా?

ప్లీడ : అవునమ్మా, ఆ క్యాష్‌లో సగం మీా అక్కయ్య కియ్యి.

సరో : మీారు చెప్పారు గాబట్టి మూడోవంతు యిస్తా.

ప్లీడ : బావుంది. కనీసం నాకు నాలుగోవంతు ఫీజు లేక పోతే ఎలా?

[ సుందరమ్మ - సరోజ తలలు పంకించుకుంటారు ]

సరో : సరేనండి.

ప్లీడ : [చేయి వూపుతూ ] ఆ క్యాష్ ముందు ఇలాపడేయండి.

సరో : దగ్గి రెక్కడిది?

ప్లీడ : ఇప్పుడు మీారు వాటాలు పంచుకున్నారుగా?

సుంద : మాటల్లో.

ప్లీడ : ఇంతేనా?

సుంద : ఏమిటండీ ?

ప్లీడ : అంతే మీ బ్రతుకులు.

సరో : అంటే ?

ప్లీడ : అంటే, నా మాట వింటే, మీరు పగటికలలు కన కుండా వుంటే కనీసం కానీ విలువైన ఆస్తి కూడా మీ తండ్రి 'హరీ' అన్న అనంతరం కూడా మీకు దక్కదని, దాని కంతటికీ ఆ గోపీ ఒక్కడే వారసు డని ఘంటాపదంగా చెప్తూ, ఇంతటితో విరమిస్తూ క్షేమంగా నిష్క్రమిస్తున్నాను. [ వెళ్లిపోతాడు ]

[ ఇద్దరూ ఒకరి ముకాలు ఒకరు చూసుకుంటారు ]

సరో : ఏమక్కా అంతేనంటావా ?

సుంద : ఆయన చెప్పింది అబద్ధ మెలాఅవుతుంది. అందులో ఆయన ప్లీడరు.

సరో : ఏంచేద్దామంటావు ? [ పచారుచేస్తూ వుంటుంది. లోపలకి వెళుతుంది ]

[ నాగేంద్రం కాళీచేతులతో తిరిగి వస్తాడు ]

సుంద : మందేదీ ?

నాగేం: ఎందుకు ?

సుంద : మీ రెక్కడికెళ్లారు ?

నాగేం: ప్లీడరు పోయేవరకూ ఆ ప్రక్కనే వున్నాను.

సుంద : మందు తీసుకురాకపోతే బాగుంటుందా ?

నాగేం: బాగుండదనే తీసుకురాలేదు.

సుంద : మీ మాటల్లో అర్థం ఏవిటి ?

నాగేం: ఆడదానివి. నీకు తెలీదులే.

సుంద : ఏమిటండీ ?

నాగేం: ప్లీడరుగారు వెళ్లేముందు అన్నమాటేవిటి ?

సుంద : ఏదో!... విరమిస్తూ... నిర్వ్యామిస్తూ...

నాగేం: అదిరైటే అనుకో... దానికి ముందు ?

సుంద : ఆడవాళ్లకు అధికారంలేదనీ...

నాగేం: అందుకే అర్థంచేసుకునే అధికారంకూడా నీకు లేక పోయింది. ఆ స్తికి వారసుడెవ్వరు ?

సుంద : గోపి.

నాగేం: ఇంతకు ముందు తెలీదా ?

సుంద : కొంతైనా నాన్న మా కిస్తాడని – – –

నాగేం: ఇస్తాడని ఆలోచించీ...అసహ్యంగా గుట్టంతా బట్ట బయలు చేసారు. అంతేగా ? [నవ్వి] దానికిలా వుందిలే.

[చంకను గోపీతో శాంతమ్మ వస్తుంది. వీధిలోకి వెళ్లబోతూంది. సరోజ లోపలినుంచి వస్తూంది]

సరో : ఆగు !

శాంత : [ఆగిపోతుంది]

సరో : ఎక్కడికి ?

శాంత : డాక్టరుగారి దగ్గిరికి.

సరో : గోపి నెందుకు తీసుక వెళ్లడం ?

శాంత : ఎందుకు తీసుకెళ్లకూడదో అర్థంగాక.

[కొంతదూరం వెళ్తుంది. సరోజ అడ్డంగా వస్తుంది]

సరో : తీసుకువెళ్ల డానికి వీల్లేదు.

శాంత : కారణం ?

సరో : వాడు మా తమ్ముడు.

శాంత : జీవించిన తరువాతగా తమ్ముడు.

సరో : ఇప్పుడు అంత ప్రాణంమీాది కొచ్చిందా ?

శాంత : చూడండి. నిజాన్ని గుర్తించే కళ్లతో చూడండి, సానుభూతి చూపే హృదయముంటే చూడండి. తమ్ముడు! నిజంగా మీా తమ్ముడయితే యిన్నిసార్లు వచ్చి చెప్పానే! ఒక్కసారన్నా తమ్ముణ్ణి చూడడానికి దగ్గిర కొచ్చారా ? డాక్టరుకన్నా కబురు పెడదాం అని ఆలోచించారా ? కనీసం మందన్నా తెచ్చి యిచ్చారా ? ఒళ్లు తీవ్రంగా కాలిపోతుంది. కళ్లు చింతనిప్పుల్లా అయిపోయాయి. పరాకుగా మాట్లాడి, మాట్లాడి స్పృహ లేకుండా పడిపోయాడు. చూస్తూ నే నూరుకోలేను. కన్నతల్లి లేకపోయినా, ఆ తల్లి చెల్లెల్ని కాబట్టి నా కా బాధ్యతుంది. బిడ్డ ఏమౌతాడో అని నాకు భయంగావుంది. ఆపు చేయకు నే వెళ్లాలి.

నాగేం : శాంతమ్మా !

శాంత : ఏం ?

నాగేం: వాడ్ని ఆ సోఫామీద వుంచు.

శాంత : ఎందుకు ?

నాగేం: ఉంచాలి.

శాంత : డాక్టరి దగ్గిర కెళ్ళాలి.

నాగేం: వెళ్ళాలంటే నువ్వే వెళ్ళు. వాణ్ని తీసుకెళ్ళడానికి వీల్లేదు. గోపీని తీసుకొండి.

సుంద : ఏడమ్మా !

శాంత : [యిచ్చి] జాగ్రత్తగా చూస్తూవుంటారు కదూ ? నే నిప్పుడే వస్తాను. [వెళ్తూ వుంటుంది]

గోపి : [హీనంగా] చిన్నమ్మా !

శాంత : [వెనక్కి తిరిగి] బాబూ !

సుంద : వెళ్ళమ్మా ! ఏమిటా కంగారు. మేం జాగ్రత్తగా చూస్తుంటాంగా ! వెళ్ళు.

[శాంతమ్మ వెళుతుంది. సుందరమ్మ గోపీని సోఫాలో పడుకోబెడుతుంది. మొగంలో చూస్తూ.]

సుంద : గోపీ...ఒరే గోపి ! ఏది యిలా చూడు.

[గోపి స్పృహతప్పి వుంటాడు]

సరో : [చేయివేసి] నిజమేనక్కా ! ఒళ్ళు వేడిగా కాలిపో తూంది. ఏం బావా ! మందు తీసుకు రాలేదా ?

నాగేం: వెళ్ళాను. డాక్టరు రావు కనిపించలేదు.

సరో : ఇంత టౌనులో ఆ డాక్టరు రావు ఒక్కడేనా వున్నది.

నాగేం: చాలామంది ఉన్నారనుకో. ఎలాగైనా ఎరిగున్న డాక్టరయితే మంచిదని అక్కడికే వెళ్లా.

సరో : జ్వరం తగ్గడానికి ఏ డాక్టరయితే ఏం?

నాగేం: అది రైటే అనుకో [సుందరవాడ్ని చూసి] ఒక్క జ్వరమే అయితే పిలిస్తే ఎందుకు పలకడూ? ఇది సన్నిపాత జ్వరమై యుంటుంది.

సరో : అమ్మయ్యో! ఇప్పుడైనా తొందరగా వెళ్లు బావా!

సుంద : ఏమిటే ఆ కంగారు! శాంతమ్మ వెళ్లిందిగా?

సరో : ఎంత ధైర్యమక్కా నీకు? ఒక్కప్రక్క పసిబిడ్డకు ప్రాణంమీదికి వస్తే ఎవరో వెళ్లారని చెబుతా వేమిటి? వెళ్లు బావా. తొందరగా వెళ్లు.

సుంద : పిచ్చి చెల్లి. నీ కెంత కంగారో నా కంత శాంతం.

సరో : శాంతం కాదిది. మనిషి ప్రాణాలుతీసే లక్షణం.

సుంద : [గంభీరంగా] చెల్లాయ్! నీవు చిన్న పిల్లవని చెబుతున్నాను.

సరో : పెద్దతనమనేది యిలాంటి పరిస్థితుల్లో అశ్రద్ధ చూపడానికేనా?

సుంద : నాతో లోపలికి రా. మాట.

సరో : ఎందుకూ?

సుంద : రావాలి. [ఇద్దరూ వెళతారు]

[ నాగేంద్రం లేస్తాడు. భయంకరంగా కనిపిస్తుంది మొగం. ఏదో నీచమైన ఆలోచనలు అతని మొగముపై కనిపిస్తాయ్. దురాలోచనతో గోపి దగ్గర కూర్చుంటాడు. లోపల మాటలు విని వెంటనే లేస్తాడు. ]

సుంద : [లోపల] ఆఖరసారి చెబుతున్నా. నే చెప్పినట్లు విను. లేకపోతే ఒక కానీ ఆస్తికూడా నీకు దక్కదు. తెలుసా!

[నాగేంద్రం ఒక నిర్ణయానికి వచ్చి, కుర్రవాడిదగ్గిర కూర్చొని కంఠందగ్గిర రెండుచేతులూ పెడతాడు. వెంటనే వీధిలోంచి సుబ్బారావు వచ్చి చూస్తాడు.]

సుబ్బా: అన్నయ్యా! [నాగేంద్రం కంగారుగా చూస్తాడు]

సుబ్బా: [దగ్గరగా వస్తాడు] ఏం చేస్తున్నావ్?

నాగేం: [బాగా విచారంగా] ఏముంది గోపీ...

సుబ్బా: ఆఁ! ఏమయింది?

నాగేం: జ్వరం ఎక్కువగా వుంది. నాకు ఆందోళనగా వుండి ఊరికే చూస్తున్నాను. మాట పడిపోయింది.

సుబ్బా: అంతేనా? [అటు చూసి] వాళ్లేరీ?

నాగేం: ఏం?

సుబ్బా: మావగారూ......

నాగేం: తిరిగి వస్తున్నారా?...

సుబ్బా: కాదు. మీరందరూ అనుకున్నదే జరిగింది.

[సరోజ సుందరమ్మ వచ్చి నిలబడతారు]

సుంద : ఏం? మళ్లీ ఎక్కువైందా? మేం అలా అనుకోలేదే-

సుబ్బా: కాదు......పోయారు. [ఏడిస్తాడు]

సరో : [ఏడుస్తూ] ఆఁ!......నాన్నా...

[సుందరమ్మ భుజంమీద వాలిపోతుంది. సుబ్బారావు లోని కెళతాడు. నాగేంద్రం కుర్చీమీదకూర్చుని విచారం నటిస్తాడు]

సుంద : [ ఏడుస్తూ ] ఎంతపని జరిగింది చెల్లాయ్ ! ఏడవకు...
ఇప్పుడే మనం ధైర్యంగా వుండాలి.

సరో : ధైర్యంగా ఎలా వుండగలమక్కా. నాన్నకు మన మంటే ఎంత ప్రేమ. ఎంత అభిమానం. దానికి తగినట్టుగా నేను ప్రవర్తించలేదని ఇప్పుడు బాధపడుతున్నాను. ఆయన ఎంతో ఆప్యాయంగా, తల్లిలేని దాన్నని ఆదరిస్తే అహంభావంతో ఆయన్నే ఒకోసారి చంటిపిల్లవాడ్ని గదమాయించినట్టుగా గదురుకునేదాన్ని...నాన్నా......

నాగేం: [ లేచి ] సరోజా...ఇటు చూడు. మీఅక్కకి మాత్రం బాధ లేదంటావా? ఆ మాటకొస్తే నాకెంత కష్టంగావుందో భగవంతుడికి తెలుసు. ఆపదలో ధైర్యంగా వుండడం మంచివాళ్ల లక్షణం. మావగారు మంచివారే గాని ఏంచేస్తాం......ఆయనకీ మనకీ ఋణం తీరిపోయింది. పెద్దవాడు...అందులోనూ ఆరోగ్యం చెడిపోయింది, వెళ్లేటప్పుడే అనుకున్నాను. ఆయన పోయాడంటే ఆశ్చర్యం లేదు. కాని బాధ ఉంటుంది. దిగమింగాలి. ధైర్యంగా వుండాలి. ఇప్పుడు ఈ ఆస్తి బాధ్యత మనమీద పడింది. అయినవాళ్లూ, కానివాళ్లూ కాస్తో కూస్తో పట్టుకు పోదామని ఇక యింటిమీాద పడతారు.

ఆ స్త్రీలో చిల్లి కానీ కూడా ఎవరికీ దక్క నివ్వకూడదు.
[ శాంతమ్మ మందుతో భయంగా వస్తుంది. నాగేంద్రం చూస్తాడు. ]

నాగేం: ఆగు!

శాంత : ఏం!

నాగేం: ఇక ఈ యింట్లో నువ్వేం ఇక శ్రమ తీసుకోనక్కర లేదు.

శాంత : ఏమిటి మీా రనేది?

నాగేం: ఈ యింట్లో నీ కేం పని లేదంటున్నాను.

శాంత : ఆ మాట లనేవారు వేరే వున్నారు.

నాగేం: వారు మననుంచి వేరయారు; కాబట్టే ఆ మాట నేను అంటున్నాను.

శాంత : నా కర్థం కావడంలేదు.

నాగేం: అర్థం చేసుకోవలసిన అవసరం కూడా లేదు. ఇక బైటకు వెళ్లు.

శాంత : నేను వెళ్లను.

నాగేం: ఆ మాటనడానికి ఇప్పుడు నీ కధికారం లేదు.

శాంత : ఉంది కాబట్టే అంటున్నాను. మీా రెవరు నన్ను వెళ్లమనడానికి......ఎవరైతే నన్ను యిక్కడికి తీసుకవచ్చారో వారు చెబితే నే వెళతాను.
[ పుత్రవాడి దగ్గరి కెళుతుంది. మందుసీసా దగ్గర పెడుతుంది]

సుంద : ఈ సమయంలో ఏమిటండీ గొడవ...ఏవమ్మా... మా నాన్న పోయాడు. ఇప్పుడే వైరొచ్చింది.

శాంత : ఆఁ!...... [కన్నీళ్లు కారతాయి]

సుంద : ఇక నువ్వు మేమఁతా కలిసివెడ్చినా నాన్న తిరిగిరాడు.

సరో : [బాధగా] నీలాంటి దురాశాపరురాలు మా యిల్లు పట్టినప్పటినుంచే మా నాన్నగారి ఆరోగ్యం పాడైంది. ఇంకా ఎందుకు వెళ్లు.

శాంత : [ఏడుస్తూ] అమ్మా!...నే నేం తప్పు చేశాను ? నే నెందుకు వెళ్లిపోవాలి ?

సరో : నువ్వు యిక్కడ వుండడమే తప్పు.

శాంత : సరోజా! నేను దాసీ దాన్నేం కాదు. వారు కోరారు ... నేను వచ్చాను. ఈ పసిబిడ్డను నా ప్రాణంతో సమానంగా చూసుకుంటున్నాను. మిమ్మల్ని డబ్బు కావాలని కోరలేదు. పెత్తనం చేయాలనే పేరాశ అంతకన్నా లేదు. కాస్త తిండి పెట్టండి. ఈ బిడ్డను చూసుకుంటూ యిక్కడే పడుంటాను.

నాగేం: నువ్వు ఆలోచించేదంతా రైటే అనుకో. కాని ఆ పప్పు లిక్కడ ఏమీ ఉడకవ్.

సరో : ఆయన బతికున్న నాలుగు రోజులూ నువ్వు ఆడింది ఆట, పాడింది పాటగా సాగిందీ యింట్లో.

నాగేం: ఆయన యిష్టపడితే ఎందుకైనా ఆమోదించడానికి సిద్ధంగా కూర్చున్నావ్. కాని పాపం నీ కోరిక నెరవేరలే.

శాంత : [ కోపంగా ] నాగేంద్రం!

[ అంతా భయంగా చూస్తారు ]

శాంత : నాలో ఏ కోరిక వుందని నువ్వు కనిపెట్టావు బాబూ! నేను ఆయన్నుండి ఏమాశించానని గ్రహించావ్. నాలో ఆశలన్నీ నా చిన్ననాడే నాశనమై పోయాయి. 'భర్త పోయిన హిందూ స్త్రీ ఆశించే దేమిటి? మరణం. ఆ మరణానికి కరుణ కలిగే వరకూ కావలసినవాళ్ల ఇళ్లల్లో జీవచ్ఛవంలా జీవిస్తూవుండడమేగా? అందుకే యీ పంచను యీ పసివాడ్ని చూసుకుంటూ బ్రతకాలని ఆశించాను...మంచిని గుర్తించే మంచితనం ఆయనలో ఉంది కాబట్టి నన్ను ఆదరించారు. దాసీదానికన్నా కాస్త విలువిచ్చిన మాట నిజం. భార్య చెల్లెల్ని కాబట్టి బంధుత్వంకొద్దీ చనువు తీసుకున్నమాట వాస్తవం. అంతమాత్రాన అతి నీచమైన అర్థాన్ని నీ మనస్సులో కల్పించుకుని నన్ను తూలనాడడం కావుందా బాబూ?

సుంద : చిన్నమ్మా నువ్వేం బాధపడకు. ఆయన తెలియక పొరపాటున మాటన్నారు......

నాగేం: పొరపాటు కాదు. నిజమనే నమ్మి నే నన్నాను.

సరో : అవునక్కా! నువ్వేమిటీ? ఆవిడ్ని ఊరికే సమర్థిస్తావ్. [ శాంతమ్మతో ] నీకు సిగ్గులేదూ – వెళ్లిపొమ్మన్నప్పుడు వెళ్లిపోకూడదూ?

శాంత : అవును. ఏమీ లేకపోయినా ఆడదానికి సిగ్గు ఉండడం అవసరమేనమ్మా! ఆ నిజాన్ని తెలుసుకుని శాసిస్తూన్నందుకు నేను నిజంగా నిన్ను మెచ్చుకో వాలి. కాని ఆ సిగ్గు పాటించవలసినవాళ్లు పాటించ లేకపోతున్నారని బాధ పడుతున్నాను. ఆడంబ రంతో...ఆవేశంగా ఆజ్ఞాపించే దానికన్నా...ఆచ రించి...ఆదర్శంచూపి...ఆచరింపజేయడం ఎంతో అవసరం. ఇందులో ఎవరికి సిగ్గులేదో ఆలోచిస్తే నీకే అర్థమౌతుంది...అలాంటి మంచి మనిషి పోగా లేంది నా బ్రతుకో్కసం నేనిక్కడపడి ఏడ్వాలను కోటం కూడా పొరపాటే...వెడతానమ్మా. నా బిడ్డ నొకసారి చూసి వెళతాను.

[స్పృహతప్పి పడివున్న గోపి దగ్గిర కెళుతుంది]

శాంత : [కళ్ల నీళ్లతో మోకరిల్లి] బాబూ!...నాన్న...లేడు. ఇక నేనుకూడా లేను...భగవంతుడు నా ఆయుష్షు కూడా నీకిచ్చి తప్పకుండా కాపాడతాడు. [లేస్తుంది] వెళ్లొస్తా. మీ కందరికీ దణ్ణంపెడ్తాను. ఈ బిడ్డను జాగ్రత్తగా కాపాడుతూ వుండండమ్మా. నా కడ సారి కోరి కదే.

[శాంతమ్మ వెళ్లబోతూంది. సుబ్బారావు లోపలినుంచి వస్తాడు]

సుబ్బా: ఎక్కడికమ్మా!

శాంత : వెళ్తున్నాను బాబూ!

సుబ్బా: ఎవరు వెళ్లమన్నారు?

నాగేం: మేము.

సుబ్బా: అంటే?

సరో : నేను.

సుబ్బా: ఓహో! అయితే నీ భర్తను నేను. నే నామెను వెళ్లొద్దంటున్నాను.

సరో : ఈ యింట్లో అధికారం మీ కెవరిచ్చారు?

సుబ్బా: నా పెళ్లాం. అంటే నువ్వు - ఆగమ్మా!

శాంత : వద్దు నాయనా. నాగురించి నువ్వు నిష్టూరపడొద్దు. కష్టాలపాలు కావొద్దు. వెళ్లొస్తాను. గోపీని జాగ్రత్తగా చూస్తూ వుండు. [వెళ్లిపోతూంది]

సుబ్బా: సరోజా! చచ్చేవరకూ యిది వీడదు. అదేమిటని పజిలు గురించి వదినగారిని అడిగితే 'ఆశ' అని ఆమె కరక్టుగా చెప్పింది. 'ఆకలి' అని నువ్వన్నావ్. ఆమెకు ఆశెక్కువ. నీకు ఆకలెక్కువ. ఈ రెండూ కరక్టే. ఇక అన్నయ్యకి 'ఆశ, ఆకలి' రెండూకూడా ఎక్కువే.

నాగేం: నోర్మూయ్!

సుబ్బా: షటప్ అని యింగ్లీషులో అంటే అందంగా వుంటుందని ముందే చెప్పాను. తిట్లు ఘోరంగా తిట్టాలంటే యింగ్లీషులోనే తిట్టాలి. బాగా ఏడ్వాలంటే తెలుగులోనే ఏడ్వాలి. ఈ రెండూ కూడా నీకు చేతకాదు.

నాగేం: విన్నావా సుందరం. మీ మరిదిగారి మెహర్బానీ.
సుబ్బా: మా యావిడితో చెప్పు.
సుంద : ఏమిటి సుబ్బారావ్? నీవు మరీ మీరిపోతున్నావ్.
నాగేం: విచారించాల్సిన సమయమని వూరుకుంటున్నాను గానీ...
సుబ్బా: లేకపోతే.
నాగేం: చాచి కొట్టేవాడ్ని.
సుబ్బా: చేతిలో బలముందా. పెద్దన్నయ్యా! చాచి గొడ్తా డట...ఆడదా న్ననుకున్నావా అన్నయ్యా?
నాగేం: నువ్వే మగాడివనే నమ్మకమే ఉంటే ఈ యింట్లో ఎందు కుంటావ్?
సుబ్బా: నా సొమ్ము తింటూ నే నిక్కడుంటున్నాను. నీలాగ పరాయి సొమ్ముతో పదవులు కొనుక్కోడా నికి రావడల్లేదు.
సరో : ఏమిటి...ఆ మాటలు... ఇదా సమయం. మంచీ చెడ్డా అక్కర్లేదూ?
సుబ్బా: అవును. మీకు తెలిసినంత చెడ్డ నాకు తెలియదు. కాని మీ కన్నా మంచే నా కెక్కువ తెలుసు. మంచీ చెడ్డా తెలిసుండేనా? ఇంటి యజమాని చచ్చాడని కబురు తెలీగానే - ఇంట్లో ఉన్న ఉత్త ములాలిని బైటికి సాగనంపారు? మంచీ చెడ్డా తెలి సేనా మనిషి మరణించక ముందునుంచే వాటాల

గురించి పెనుగులాడుకు చస్తున్నారు. మంచీ చెడ్డా తెలిసుండేనా జ్వరంలో ఉన్న ఆ పసిబిడ్డకు మందు లేకుండా చేశారు? మంచీ - చెడ్డా......

సరో : [ బిగ్గరగా ] మిమ్మల్నే. ఇల్లా మాట్లాడితే ఏం మర్యాదగా వుండదు తెలుసా?

నాగేం: అసలు మర్యాదంటూ ఉంటేగా.

సుబ్బా: 'మనకు మర్యాదంటూ తెలిస్తేగా' అను అన్నయ్యా!

సుంద : ఇదేం బావుండలే దబ్బాయి...

సుబ్బా: ఏది బావుండని వచ్చే పజిల్లో పాయింటొస్తే నీ మాట జ్ఞాపకం పెట్టుకుంటాలే వదినా.

సరో : ఇదేం వేళాకోళం కాదు.

సుబ్బా: అని నే ననుకోలేదు.

సరో : మరేమిటి మీా మాటలు?

సుబ్బా: మాటలుగాక, మాటల్లో పాటలుకూడా పాడ్డానికి యిదేమన్నా సినిమా అనుకున్నావా!

నాగేం: శృతి మించుతుంది.

సుబ్బా: అయితే తగ్గించన్నయ్యా!

సరో : ఇలా అయితే మీారు కూడా.....

సుబ్బా: బైటి కెళ్లాల్సి వుంటుందా?

సరో : అవును.

సుబ్బా: భార్యగా రాజ్ఞ! తప్పకుండా వెళతాను.

సరో : ఎక్కడికి ?

సుబ్బా: ఫస్టు ప్రైజు వస్తే, నిన్నుకూడా జుట్టు పట్టుకు లాక్కెళ్ల డానికి ?

సరో : మీ తరంగాదు.

సుబ్బా: ఎవరితరం గాదో నువ్వే చూద్దువుగాని. ప్లీడరు గారితో ఆలోచించి, నా పాతికెకరాలూ నేను తీసుకుని నిన్ను చెటుకుపిప్పిలా విడిచిపెట్టేస్తాను. అంటే విడాకు లిస్తాను. నీలాంటి భార్యారత్నంతో కాపురం చేసేదానికన్నా కాషాయి గుడ్డలు కట్టుకుని కమండలం చేత్తో పట్టుకుని జై సీతారాం అనడం చాలా మంచిది. ఇప్పుడు మీ గుట్టు నేను బట్టబయలు చేయకపోతే మీ ముగ్గురిమీదావొట్టే.

సరో : మిమ్మల్నే ! ఆగండి !

సుబ్బా: నీ అజ్ఞాపనలకు ఆయుష్షు తగ్గిపోయింది సరోజా! గుడ్ బై. [ వెళతాడు ]

నాగేం: వట్టి పైత్యం.

సరో : బావా!...వెళ్లి పిల్చుకు రావూ ?

నాగేం: ఎందుకూ! తిరిగి తిరిగి అతనే వస్తాడులే. నువ్వూరుకో.

సరో : బావా, నా మాట వినవూ?...

సుంద : లేని మాటలు చెప్పి మనమీద ఏం అపవాదు తీసుకొస్తాడో. వెళ్లండి.

నాగేం: అది రైటే అనుకో. అతని మాటలు నమ్మే దెవడంటాను? చీకటిపడుతుంటే నేనిప్పుడెక్కడి కెళ్లేదీ?

సుంద : ఎలాగైనా ఈ రాత్రి మనం చాలా జాగ్రత్తగా వుండాలి. నాకేమిటో చాలా భయంగావుంది. ఏ పాడు ఆలోచనలూ పెట్టుకోకుండా... గోపి గాడ్ని కాపాడుతూవుండాలి.

[నాగేంద్రం నిలబడతాడు. ఇద్దరూ గోపిని చూస్తూ దగ్గర కొస్తారు. మెల్లగా లైట్లు ఆరిపోతాయి. మెల్లగా లైట్లు వెలుగుతాయి. సుందరం సరోజ వుండరు. నాగేంద్రం తీవ్రంగా ఆలోచిస్తూ పచారు చేస్తుంటాడు. కాస్సేపటికి గోపి మెల్లగా లేస్తాడు. నీర్సంగా అంతా చూస్తారు]

గోపి : చిన్నమ్మా! చిన్నమ్మా!

నాగేం: [ఆశ్చర్యంగా చూస్తాడు. దగ్గర కొస్తాడు] గోపీ!

గోపి : [ఏడుస్తూ] నాకు చిన్నమ్మ కావాలి...

నాగేం: వస్తుంది కానీ...... [నుదుటమీద చేయి వేసి] అరె! జ్వరం తగ్గిపోయిందే?

గోపి : ఏం తగ్గిపోతే! తగ్గకుండా వుండాలనా?

నాగేం: ఛీ ఛీ...అదేం మాటరా! [లోనికిచూసి] సుందరం?

సుంద : [వస్తుంది] ఏం?

నాగేం: రాత్రి గోపీకి ఆమె తెచ్చిన మందు ఎవరన్నా యిచ్చారా?

సుంద : నే నివ్వలేదే! [గోపీని చూసి] లేచి కూర్చున్నాడే! [దగ్గిర కెళ్లి చూసి] ఏం బాబూ! జ్వరం తగ్గిపోయిందా?

గోపి : ఫో! చిన్నమ్మేది? ఎక్కడికి కెళ్లింది?

సుంద : కంగారు పడకు. వస్తుంది. అలా డాక్టరు దగ్గిర కెళ్లింది.

[సరోజ వస్తుంది]

గోపి : నాన్న లేడు. చిన్నమ్మా లేదు. [పడుకుంటాడు]

నాగేం: ఆ మందు నువ్విచ్చావా సరోజా?

సరో : అవును. రాత్రి నేనే యిచ్చాను.

నాగేం: ఎందు కివ్వాలి?

సరో : ఎందుకివ్వకూడదు? మందిస్తేనేగా జ్వరం తగ్గేది!

నాగేం: అది రైటే అనుకో. ఆ మందు ఎలా యివ్వాలో, ఎన్ని మోతాదు లివ్వాలో తెలీకుండా...

సరో : తెలీకుండా యిస్తేనేం? గోపీకి తెలివొచ్చిందిగా

సుంద : నీ తెలివి తెల్లారినట్టేవుంది.

నాగేం: ఇలా అయితే మన బ్రతుకులు తెల్లారతాయి.

సరో : అలా అయితే ఎంతో సుఖపడతాం.

నాగేం: సరోజా! ఏమిటి నీ వుద్దేశ్యం?

సరో : అర్థం చేసుకుంటే సదుద్దేశమే అవుతుంది.

సుంద : అయితే మన మనుకున్న మాటలు?

సరో : నీటిలో మూటలే.

సుంద : సరోజా!......

సరో : అక్కా! నేను చిన్నదాన్ని. నా ఆలోచనలుకూడా చిన్నవిగానే వుంటై. నాన్న పోయారు. ఆయన యింట్లోంచి వెళ్లిపోయారు, నా కింకేం కావాలి? నాలో ఓపిక లేదు. కోపముంది. ఆలోచన లేదు. నా కావేశముంది. ఈనాటి వరకూ అవి మంచి లక్షణాలేనన్న నమ్మకం నాలో కరుడుగట్టింది. దానివల్లనే నేనేం మాట్లాడుతున్నానో నాకే తెలీకుండా మాట్లాడాను. కరుడుగట్టిన ఆ గట్టి నమ్మకంమీద ఏదో పెద్ద దెబ్బ తగిలింది. హృదయం చిట్లిపోయింది. నే నేపాపం చేయలేను. నే నే దుర్మార్గం చేయలేను. నన్నేమీ అడగొద్దు.

[ఏడుస్తూ లోనికి వెళ్లిపోతుంది. యిద్దరూ ఆశ్చర్యంగాచూస్తారు. నాగేంద్రం ఒకసారి అటు యిటూ తిరుగుతాడు. ఒకసారి ఆగుతాడు.]

నాగేం: బాగానేవుంది. ఏవిటి సుందరం? సరోజ యిలా మారింది?

సుంద : ఏముంది! ఎప్పుడైనా కష్టాలెరుగుంటేగా. నాన్న పోయాడు. వాళ్లాయనకూడా వెళ్లిపోయాడు. ఒక్కసారే మనస్సు చెడిపోయింది.

నాగేం: అది రైటే అనుకో. అయినా యింత మార్పా! విన్నట్టే విని వెంటనే ఎదురు తిరిగిందే. అయితే మనం ఒకళ్లం ఏం చేయగలం?

సుంద : మనం ఒక్కళ్లం ఏమిటి? మీరు, నేనూ అంటే యిద్దరం.

నాగేం: అబ్బ! అది రైటే అనుకో. [భయంగా] మనం చేసే ప్రయత్నం...

సుంద : [నవ్వుతుంది]

నాగేం: [కోపంగా] ఎందుకు నవ్వుతావ్?

సుంద : మీరు వట్టి పిరికివారండి. ఏదో మగవాళ్లమని చెప్పారుగా యింతేనా?

నాగేం: అది రైటే అనుకో......

సుంద : కౌన్సిలరు కూడాను. ఆ మాత్రం దూరాలోచన వుండొద్దూ?

నాగేం: దురాలోచనా?

సుంద : కాదు దూరాలోచన.

నాగేం: ఏదయినా ఒకటే అనుకో. యిప్పు డేంచేద్దామంటావు?

సుంద : మీ రిలాగే వుండండి. రెండు రోజులలో అది మారుతుంది. లేదా నేను మారుస్తాను.

[ గోపి ఉలుక్కుపడి లేస్తాడు ]

గోపి : చిన్నమ్మా! చిన్నమ్మా!

[ సుందరం, నాగేంద్రం పట్టుకుంటారు ]

గోపి : ఏదీ! చిన్నమ్మేది? నాన్నెక్కడి కెళ్లాడు చెప్పండి.

సుంద : గోపీ! నామాట విను నాయనా వాళ్లిద్దరూ వస్తారు.

గోపి : నేను వినను. నేను మా నాన్న దగ్గిరి కెళ్లిపోతాను; నన్ను విడిచిపెట్టండి.

[ గింజుకుని పరుగెత్తబోయి గుమ్మంలో డ్రాయరు దగ్గిర పడిపోతాడు. సరోజ లోపలినుంచి వచ్చి పడిపోయిన గోపి దగ్గిరికెళుతుంది. గోపి స్పృహతప్పి పడిపోతాడు. ]

సుంద : ఏమి టాలోచిస్తారు? నా కా గదిలోకి వెళ్లడం భయంగా వుంది. కాస్త మంచం తీసుకొచ్చి ఇలా వెయ్యండి.

[ నాగేంద్రం లోనికి వెళతాడు ]

సుంద : ఏమి టాలోచిస్తున్నావ్ ?

సరో : కాసిన్ని నీళ్లు తీసుకురా అక్కా!

సుంద : [ కొంతవరకూ వెళ్లి ] ఏ మోనమ్మా! నా కేమిటో భయంగా వుంది.

సరో : సరే! నేనే వెళ్తాలే. గోపీని తీసుకో.

[ సుందరమ్మ తీసుకుంటుంది. సరోజ లోనికి వెళుతుంది. నాగేంద్రం మంచం తీసుకొచ్చి వేస్తాడు. సుందరమ్మ గోపీని మంచంమీద పడుకోబెట్టి నాగేంద్రం చెవిలో ఏదో చెపుతూ వుంటుంది. సరోజ వచ్చి యిద్దరినీ చూస్తుంది. ఇద్దరూ కంగారు పడి తప్పుకుంటారు. సరోజ కుర్రవాడి మొగంమీద నీళ్లు జల్లి తుడుస్తూ వుంటుంది. సుందరమ్మ నాగేంద్రంకి సంజ్ఞ చేస్తుంది. నాగేంద్రం మెల్లగా జారుకుంటాడు. కొంసేపటికి సరోజ చూస్తుంది. ]

సరో : బావేడే!

సుంద : అలా వెళ్లారు.

సరో : ఎందుకు ?

సుంద : ఏమో నాకేం తెలుసు ?

సరో : నీకేం తెలీదూ ?

సుంద : మందు కోసం వెళ్లే డనుకుంటాను.

సరో : అనుకుంటావు. అంతే.

సుంద : ఏమిటి సరోజా అలా మాట్లాడుతావు.

సరో : [ లేస్తుంది ]

సుంద : ఏమి టాలోచిస్తున్నావు ?

సరో : బావ తెచ్చిన మందులో నాకూ కాస్త కొంత ఇవ్వకా !

సుంద : సరోజా !

సరో : ఏం !

సుంద : నీ వరసేమీ అర్థంగావడం లేదు. ఎందుకు నువ్విలా యిదయి పోతావు. మనసులు బాగులేనంత మాత్రాన మనుషులుగా బ్రతకడం కూడా మరచి పోవడమేనా. నాన్న పోయారు. అదెవరూ కాదనరు. అంత మాత్రాన నాన్నతో మనంకూడా పోతామా ? ఇక సుబ్బారావు సంగతా ! అదొక రకం కనిపి. ఎక్కడికి వెళతాడు. ఇవ్వాళ గాక పోతే రే పొస్తాడు. ధైర్యంగా వుండాలి. ఇంత ఆ స్తుంది. నువ్వే యిలా అయిపోతే యిదంతా మా గురించా సరోజా ? ఆలోచించు.

సరో : ఆలోచించాను.

సుంద : ఏ మది ?

సరో : ఆ స్తి కోసం అవక తవక పనులు చేయడం మంచి దికాదని.

సుంద : ఎవరు చేస్తా నన్నారు ?

సరో : నాతో చెప్పిన వాళ్లే.

సుంద : అయితే మొదట్లో నువ్వుగూడా భాగ స్తురాలివేగా?

సరో : ఇప్పుడు కాను.

సుంద : కాకపోతే దూరంగా వుండు.

సరో : దూరంగా చూస్తూ వుండలేను.

సుంద : నేను చెబుతున్నాను. నువ్వు నా కన్నా చిన్నదానివి కాబట్టి వినాలి.

సరో : వినకపోతే.

సుంద : అనాదు రాలవై పోతావ్.

సరో : అయినా యిష్టమే.

సుంద : నాకు కోపమంటే అసహ్యాం. నీ మంకుపట్టు చూస్తే నాకు కోపమే కాదు. నిన్నేం చేసినా పాపం లేదని పిస్తుంది.

సరో : అవును. పాపులకు పాప మంటే భయముండదు...

సుంద : ఏమన్నావ్ ?

సరో : అనడమే కాదు. మీరు చేసే పని నేను అటకాయిస్తాను.

సుంద : సరోజా!

సరో : మీ ఆయన దుర్మార్గాలను చూస్తూ నేను సహించ లేను. మీరు చేసే విషప్రయోగాన్ని......

[ సుందరమ్మ కోపంగా కొడుతుంది. సరోజ కళ్ల నీళ్లతో చూస్తుంది. కొంతవరకూ వెళుతుంది. తిరిగి వస్తుంది. సుంద రమ్మ చేయి గట్టిగా పట్టుకుంటుంది ]

సుంద : సరోజా!

సరో : ఏం!

సుంద : [ భయంగా ] కొడతావా!

సరో : లేదు.

సుంద : సరోజా! క్షమించవూ ?

[ ప్లీడరు వస్తాడు. చూస్తుంది. సరోజ లోనికి వెళ్తుంది ]

ప్లీడ : సరోజా!

[ ఆగదు. తిన్నగా లోనికి వెళుతుంది ]

ప్లీడ : అదేవిటి ? అలా వెళ్లిపోతుంది.

సుంద : [ విచారంగా ] దాని మనసేమీ బాగుండ లేదండి.

ప్లీడ : ఎందువల్ల ?

సుంద : [ దుఃఖంతో ] ఏమిటండీ, తెలియనట్లు అలా అడుగు తారు. మా నాన్న......

ప్లీడ : అవు నవును. నిజంగా పొరపాటే. ఏమనుకోవద్దు సుందరమ్మా! ఆయన నాకు కూడా మిత్రుడే. రాత్రి తెల్లవార్లు నేనుకూడా చాలా విచారించాను. ఏదో మీకు శాస్త్ర ధైర్యం చెప్పాలనే యిలా

వచ్చాను. వచ్చింతరువాత అంటే యీ వాతావరణంలో పడ్డ తరువాత, వచ్చిన విషయాన్ని మనస్సెందుకో మరిచిపోయింది. పాడు మనస్సు. ఈలాంటి విచార సమయంలో మీారిద్దరూ తప్ప ఈ యింట్లో మరెవ్వరూ కనిపించడంలేదు. వారంతా నీలగిరి ప్రయాణ మయ్యారా?

సుంద : ఎక్కడ నీలగిరి? ఎలా వెళ్లగలం చెప్పండి.

ప్లీడ : అవును. అవును పాపం! అయితే అంతా యింకా విచార సముద్రంలో మునిగి ఉన్నారన్నమాట. [లోపలి కెళ్లబోతూ] నాగేంద్రింగారూ!

సుంద : లేరండి. వారు ముందు కెళ్లారు.

ప్లీడ : సుబ్బారావు ఎక్కడ?...

సుంద : ఎక్కడి కెళ్లాడో తెలీదండీ!

ప్లీడ : శాంతమ్మ వంట ప్రయత్నంలో వుందనుకుంటాను.

సుంద : ఇంట్లోంచి వెళ్లిపోయిందండి.

ప్లీడ : అరె! ఎందుకు వెళ్లింది? ఎవరు వెళ్లమన్నారు?

సుంద : ఇలాంటి సమయంలో అలా అనడానికి ఎవరికి ధైర్యముంటుందండి.

ప్లీడ : అవునవును. ఆవిడ కావిడే వెళ్లిపోయి ఉంటుందన్నమాట.

[సరోజ వస్తుంది]

సరో : లేదు. నేనే వెళ్లిపొమ్మన్నాను.

ప్లీడ : మరి మీ అక్క చెప్పింది......

సరో : అబద్ధం...

సుంద : సరోజా!

సరో : ఎందుకు? నీ అంత ధైర్యంగా అబద్ధం చెప్పలేదనే కదూ? ప్లీడరుగారికి కూడా తెలుసు.

[ సుందరమ్మ లోనికి వెళుతుంది ]

ప్లీడ : బాగా తెలుసు...కాని యింత అన్యాయం చేయడానికి కారణం అడగవచ్చా?

సరో : ఆమంటే నాకు మొదట్నుంచీ కోపమే. ఆ కోపానికి కారణం.....ఆమెలో శాంతమే నేమో......ఆ లక్షణం ఆమె ఎలా అలవర్చుకుందో నా కర్థం కాలేదు. స్వార్థ పూరితంగా తనే పెద్ద సహన దేవతలా ఆమె ప్రవర్తించడం చూస్తే నాకు చాలా బాధ కలిగేది. తీవ్రంగా మాట్లాడే మాట్లకు ఆమె మెల్లగా యిచ్చే సమాధానాలు నా మనస్సులో చాలా తూట్లు పొడిచాయి. ఆమె దగ్గర బంధువైనా దాసీ అనే భావం నాలోనుంచి పోలేదు. అలాంటి దానికి నాన్నగారే కాదు, మీరు డాక్టరూ కూడా ఎంతో గౌరవాన్నిచ్చేవారు...రాను రాను ఈ యిల్లూ, ఈ యింట్లో వున్న మనుషులూ అందరూ ఆమెకు దాసులయ్యే పరిస్థితులు వస్తున్నట్లు నేను తెలుసుకున్నాను. అలాంటి అవమా

నాన్ని అందగల శక్తి నాలో లేదు. అందుకే బైటికి నెట్టాను.

ప్లీడ : ఇది మంచిపని అనలేను గాని, నిజాన్ని చెప్పినందుకు నేను మంచిగా మాత్రం సంతోషిస్తున్నాను. మరి సుబ్బారావు ఎక్కడికి కెళ్ళినట్లు?

సరో : [ బాధగా ] ఆయన్నికూడా కానిమాట లన్నాను... చాలా పొరపాటు చేశాను.

ప్లీడ : అది మీ యిద్దరిమధ్యా అలవాటయి పోయిందిగా!

సరో : ఆమెను పొమ్మన్నందుకు ఆయనకు కూడా కోప మొచ్చింది......మాటా మాటా పెరిగింది...ఇక రానని వెళ్లిపోయారు. [ ఏడుస్తుంది ]

ప్లీడ : అదేమిటి సరోజా! నీలో ధైర్యమంతా ఏమయింది?

సరో : నాశనమై పోయింది.

ప్లీడ : పాపం.

[ సుందరమ్మ వస్తుంది ]

సుంద : నాన్నగారు పోయారని తెలియగానే సరోజ మనస్సు పాడైంది. ప్లీడరుగారూ! దీన్ని ఎలా ఊహించాలో నాకేం అర్థంగావడల్లేదు. ఒకోసారి దాన్ని చూస్తుంటే నాక్కూడా భయమేస్తుంది.

ప్లీడ : అవునవును. నీకు భయం ఎక్కువ. సరోజకు ధైర్యం ఎక్కువ. ఆమెలో ధైర్యం పిరికితనంగా మారిపో యినా నీలో భయం మాత్రం అలాగే నిలిచిపో

వడం నాకు ఆశ్చర్యంగానే వుంది. సరోజ కోపంతో మండిపోయినా, నీలో ఓర్పు, పాపాల్ని కూడా మోసే భూదేవిని గుర్తు తెస్తుంది. మీలాంటి వారి మనస్సులు అర్ధం చేసుకోవాలంటే మాలాంటి వారి తరమా అమ్మా! సుందరమ్మా! ఈ విషయంలో మీ కభివందనా లర్పించలేను గాని, మీ ఆయ నెప్పుడు వస్తారో చెపితే నా దారిని నేను చక్కా పోతాను.

సుంద : ముందే చెప్పాను కదండీ–

ప్లీడ : మందు కోసం వెళ్లారనా?

సుంద : అవును.

ప్లీడ : ఏం మందు?

సుంద : గోపీకి జ్వరం తగ్గడానికి.

సరో : కాదు.

సుంద : సరోజా!

ప్లీడ : ఏవిటది?

సుంద : దాని మనస్సు బాగా లేదని చెప్పా గదండీ.

ప్లీడ : అవునా సరోజా!

సరో : మా అక్క మనస్సే బాగో లేదు. అపాయమైన ఆలోచనలతో అవస్థపడుతూ అర్ధం లేని ఆవేశంతో, అసహ్యంగా ప్రవర్తిస్తుంది.

సుంద : [ సరోజ నోరు మూస్తుంది ] నీకు పిచ్చెక్కిందా ? లోప లికి పద. ఊఁ! నడు. [ లాక్కుపోతుంది ]

[ లోపల సరోజ మాటలు. 'నన్ను విడిచిపెట్టు' అని రెండు మూడు సార్లు అంటుంది. "యిక్కడనుంచి కదిలావా నీ మర్యాద దక్కదు." అని బఘాలున తలుపు వేసిన చప్పుడవు తుంది. ప్లీడరు వెళ్లిపోతాడు. సుందరమ్మ వస్తుంది ]

సుంద : ప్లీడరుగారూ ! ప్లీడరుగారూ !

[ అటు యిటు చూసి వెళ్లి గోపీ మంచంమీద కూర్చుంటుంది ]

సరో : [ గదిలోనుంచి తలుపు కొట్టుతూ ] అక్కా ! తలుపు తీయవే తలుపు తీయ్ !

సుంద : నువ్వు చచ్చినా సరే తలుపు తీయను. నోరెత్తకు.

సరో : అబ్బబ్బ ! తీయవే. నేనెవరితోనూ చెప్పను. తీయవే తలుపు తీయవే.

సుంద : ఛీ ! నోరుముయ్. నీ మాట నమ్మేదానికన్నా నిలువునా ప్రాణం తీసుకోవడం మంచిది.

[ సరోజ అక్కా ! అక్కా ! అంటూ వుంటుంది. సుందరమ్మ సమాధానం యివ్వదు. యీ ధ్వనికి గోపీ లేస్తాడు ]

గోపి : [ వెర్రిగా ] నాన్నా ! నాన్నా ! చిన్నమ్మా ! చిన్నమ్మా !

[ లేస్తాడు. సుందరమ్మ పట్టుకుంటుంది. ]

సుంద : ఎక్కడికిరా !

గోపి : నాన్న దగ్గరికి.

సరో : [ లోపలనుంచి ] గోపీ !

గోపి : ఆఁ! [మంచం మీదనుంచి దూకుతాడు]

సరో : గోపీ! [లోపలనుంచి] అక్కా—!

సరో : గోపీ! ఎక్కడ కన్నా పారిపో. నిన్ను చంపేస్తారు-మందు పోసి చంపేస్తారు. పారి పో.

గోపి : [భయంగా] నన్ను చంపేస్తారా! చంపేస్తారా!

[సుందరమ్మ పట్టుకో బోతుండగా గోపీ తప్పించుకుని గుమ్మం ముందు పారిపోతాడు. నాగేంద్రం మందు సీసాతో వచ్చి గోపి చేయి పట్టుకుంటాడు.]

నాగేం: ఎక్కడికి? [బిగ్గరగా]

గోపి : నన్ను చంపేస్తారా?

సరో : [తలుపు తట్టుతూ] బావా!

నాగేం: ఏవిటది?

సుంద : దానికి పిచ్చెక్కింది. మీ పని మీరు కానివ్వండి!

[గోపీని పట్టుకుంటుంది]

గోపి : మందు పోసి నన్ను చం పే స్తా రా! [బిగ్గరగా] చిన్నమ్మా! [వెర్రి కేకలేసి పడిపోతాడు]

[లోపలినుంచి సరోజ కెవ్వున అరచి పడిపోతుంది. గోపీని మంచంమీద పడుకోబెడతారు. సుందరమ్మ గ్లాసు తీసుకొ స్తుంది. ఆ గ్లాసులో కొంత మందు పోస్తాడు. నోటిదగ్గర పెట్టబోతాడు.]

సుంద : ఆగండి.

నాగేం: ఏం?

సుంద : నా కేవిటో భయంగావుంది పోసీ!

నాగేం: నోరు మూసుకొని లోపలికి పో! [ సుందరమ్మ వెళ్లిపోతుంది ]

[ నాగేంద్రం కంగారులో మందు ఒలికిపోతుంది. మళ్లీ సీసాలో మందు గ్లాసులో పోస్తాడు. గోపీ నోటిలో వేయబోతాడు. డాక్టరు వెనుకనుంచి వచ్చి చేయి పట్టుకుంటాడు. నాగేంద్రం కంగారుపడి వెనక్కి చూస్తాడు. ]

నాగేం: మీరా!

డాక్ట : అవును గ్లాసు విడిచిపెట్టు.

నాగేం: మీరు విడిచి పెట్టండి. నేను మందు పోస్తున్నాను.

డాక్ట : ఆ పని నాది.

నాగేం: అవును.

( నాగేంద్రం తెలివిగా గ్లాసు వంచుతాడు. ఈ లోగా ప్లీడరు వస్తాడు. నాగేంద్రం సీసా దగ్గరకు వెళ్లేముందు ప్లీడరు సీసా చేతితో పట్టుకుంటాడు. నాగేంద్రం కంగారుపడి గుమ్మం ముందుకు పారిపోతాడు. లక్ష్మీపతి అడ్డువచ్చి నిలుస్తాడు. నాగేంద్రం తెల్లబోతాడు. )

నాగేం: ఆఁ! ఎవరూ?!! ఎవరూ?!!

సుంద : [ లోపలనుంచి సుందరమ్మ వస్తుంది ]

[ ఆశ్చర్యంగా ] ఎవరూ! నాన్నా !! బ్రతికే వున్నారా!

లక్ష్మీ : [మాట్లాడడు ]

సుంద : నాకు భయంగావుంది. ప్లీడరుగారూ మా నాన్నేనా?

ప్లీడ : డాక్టర్! లక్ష్మీపతిగారు పోయూరా?

డాక్ట : పోయూరు.

ప్లీడ : సుందరమ్మా! ఆ పాదాలు వెనుకకు తిరిగి వున్నై ఏమో చూడమ్మా!

సుంద : మామూలుగానే వున్నైయండి. నేనిక్కడ వుండ లేను. [లోపలకు వెళ్లబోతూంది]

ప్లీడ : ఆగు. నీ ప్రాణరక్షణ కోసం నువ్వు పారిపోతే యిక్కడ నీ భర్త మేమంతా చచ్చి చక్కాపోవ సిందే. ఇతను మనిషి కాడు. నిజంగా పిశాచై యుండాలి. అందుచేత విషయం ఏమిటో తెలుసు కునేవరకూ కదలొద్దు. ఆఁ! డాక్టరుగారూ! లక్ష్మీ పతిగారి కళేబరం నీలగిరిలోనే వుందా? లేక.....

డాక్ట : అక్కడ పోయారు. శవాన్ని హాస్పిటలువాళ్లు తీసు కున్నారు. అంతవరకే నాకు తెలుసు.

ప్లీడ : చాలా విచిత్రంగా వుందే? అయితే డాక్టర్! రోగు లకు మందులిచ్చి ఆరోగ్యాన్ని చేకూర్చడమే గాకుండా చచ్చిపోయిన వాళ్లకు ప్రాణంపోసే కొత్త పద్ధతి ఏ సైంటిస్టన్నా యీ మధ్య కనిపెట్టాడా?

డాక్ట : లేదే?

ప్లీడ : అయితే ఇది పిశాచే!

సుంద : [భయంగా] అమ్మయ్యో!

ప్లీడ : ఆగమ్మా! మేమింత మంది యుండగా నీ ప్రాణాల కేం ఫరవాలేదు. నీ భర్తచూడు ఎంత నిర్భయంగా నిలబడ్డాడో? ఏం నాగేంద్రం? అది రైటేనంటావా?

ఆం! మరిచా! ఈ విచిత్రాన్ని సరోజకు కూడా చూపిద్దాం. ఆ గదిలో పెట్టి గొళ్ళెం పెట్టినట్లున్నావు కదూ? డాక్టర్! ఈమె చాలా భయపడుతుంది. కదల్లేదు. ఆ గది గొళ్ళెం తీసి సరోజ నిటు తీసుకురా.

సుంద : ఆగండి. దాని మనసేం బాగో లేదు. వెళ్లొద్దు.

ప్లీడ : ఆమెకు పిచ్చెక్కిందా?

సుంద : అవును.

ప్లీడ : [నవ్వి] ఇంతేనా! వెళ్లేవారు డాక్టరు. ఇక్కడ నిలబడింది పిశాచి. నిమిషంలో పిచ్చి పిచ్చికలా ఎగిరిపోతుంది. వెళ్లి రా డాక్టర్.

[డాక్టరు వెళ్లిపోతాడు. నాగేంద్రం, సుందరమ్మ ఒకళ్లనొకళ్లు చూసుకుంటారు.]

సుంద : పదండి. నాకేమిటో భయంగావుందండి. మన యింటికి వెళ్లిపోదాం.

లక్ష్మి : వెళ్లడానికి వీలులేదు. [బిగ్గరగా] ఇది నా ఆర్డర్.

ప్లీడ : మీ ప్రయత్నం మర్డర్. కదలకండి.

[సరోజతో డాక్టరు వస్తాడు]

సరో : [చూసి భయాశ్చర్యములతో] నాన్నా!

లక్ష్మి : దూరంగావుండు. నేను చచ్చి బ్రతికాను. మీరు బ్రతికి చస్తున్నారు. దురాశతో అమాయికురాలైన శాంతమ్మను దూరంచేసి, అన్నం పున్నం తెలియని పసిబిడ్డను అంతం చేయడానికి అస్త్రులు చాచారు!

మాట్లాడవేం నాగేంద్రం? నువ్వు చేసిన ప్రయత్నం ఏమిటి? నిజం చెప్పు?

నాగేం: నాకేం తెలియదండి.

లక్ష్మి : ఏం సుందరమ్మా?

సుంద : ఆయన చెప్పింది నిజమే నాన్నా.

సరో : కాదు. కావాలంటే నేను చెబుతాను.

లక్ష్మి : నిన్నెవరూ అడగలేదు. నువ్వు మాట్లాడకు. వెళ్లి రెండు గ్లాసులు తీసుకురా. తొందరగా వెళ్లు. [సరోజ వెళ్తుంది]

లక్ష్మి : నే నడిగిందానికి అబద్ధం చెప్పడం మీరు పనిగా పెట్టుకుంటే నిముసంలో నిజం చెప్పిస్తా.

ప్లీడ : మీరేం తొందరపడకండి. శాంతమ్మ మా యింటి దగ్గర్నే వుంది.

లక్ష్మి : [ఆశ్చర్యంగా] ఆఁ!

సుంద : చాలా సహాయం చేసారు ప్లీడరుగారూ!

ప్లీడ : అది మీ నాన్నగారనవలసిన మాట. డాక్టర్ మీరు వెళ్లి ఆమెను వెంటనే తీసుకరండి.

నాగేం: అబ్బే! నేనే తీసుకొస్తానండీ. [వెళ్లబోతుండగా]

డాక్ట : అబ్బెబ్బె! మీకెందుకూ ఆశ్రమ. యిక్కడే వుండండి [బైటికి వెళతాడు]

లక్ష్మి : ఆమెను ఇంట్లోంచి వెళ్లగొట్టి ఈ విషాన్ని త్రాగించబోతున్నారు కదూ?

ప్లీడ : అది విషమని మీరెల్లా చెప్పగలరు?

నాగేం: అవును. అది విషంకాదు. జ్వరానికి మందు.

[సరోజ వచ్చి గ్లాసులు పెడుతుంది]

లక్ష్మి : నిజమా!

సుంద : నిజమే నాన్నా!

లక్ష్మి : నేనెంత అపార్థం చేసుకున్నాను. మీలాంటి సహృదయులైన ఆత్మీయులను, నా బిడ్డ ఆరోగ్యంకోసం, శ్రమపడే మంచివాళ్లని ఎంత దూషించాను.

సుంద : [నమ్మి దగ్గరగావచ్చి] ఫరవాలేదులే నాన్నా. నువ్వు బ్రతికున్నావ్ నాకంతే చాలు.

నాగేం: అబ్బ! ఎంత భయపెట్టారండీ. మీరు నిజంగా చచ్చిపోయారనుకున్నాం.

లక్ష్మి : కాని బ్రతికి చక్కావచ్చాను. ఇంటికి పెద్దల్లుడ్నీ, నా పెద్దకూతురినీ కనులారా చూసి, హృదయపూర్వకంగా నేను కోరిన బహుమతులిచ్చి సంతోషంగా సాగనంపుదామనే.

సుంద : ఏం బహుమతులు నాన్నా అవి.

లక్ష్మి : కంగారెందుకమ్మా! ఇస్తాగా.

[ప్లీడరు చేతిలో సీసాతీసి రెండు గ్లాసులలోనూ పోసి రెండు చేతులతోనూ అందిస్తూ]

లక్ష్మి : ఇవిగో బహుమతులు! ఇద్దరూ చెరొకటీ తీసుకోండి. ఊం! తీసుకోవాలి.

[ఒకరి మొగం ఒకరు చూసుకుంటూరు]

లక్ష్మి : తాగండి ఆలోచిస్తారేం.
ప్లీడ : జ్వరానికి మందు. తాగండి ఫర్వాలేదు.
సుంద : నాన్నా!
లక్ష్మి : లాభంలేదు తాగాల్సిందే!
నాగేం: నేను తాగనండి.
ప్లీడ : అది రైటే అనుకోండి.
లక్ష్మి : చెప్పినట్లు వినాల్సిందే.
ప్లీడ : చచ్చినట్లు తాగాల్సిందే.
నాగేం: తాగకపోతే.
లక్ష్మి : అరెస్టు చేయిస్తా.
సుంద : మేం చచ్చిపోవడం నీ కిష్టమా నాన్నా!
లక్ష్మి : నా బిడ్డను చంపడం మీా కిష్టమా అమ్మా!
[నాగేంద్రం గ్లాసు వంచుతాడు. సుందరమ్మ చేతిలో గ్లాసు లక్ష్మీపతి పట్టుకుంటాడు.]
లక్ష్మి : నాగేంద్రం భగవంతుడు నీకిచ్చిన పాడు బుద్ధికి గుణపాఠం చెప్పడానికి యీా శాస్త్రవుంటే చాలులే. ప్లీడరుగారు! పోలీసులకి ఫోను చేయండి. ఇతన్ని వెంటనే అరెస్టు చేయించండి.
సుంద : నాన్నా! [కాళ్లమీాద పడుతుంది] క్షమించు నాన్నా! ఆస్తి కాసించి నిజంగా నీ కన్యాయం తలపెట్టాం. పసిబిడ్డ ప్రాణం తీయడానికి ప్రయత్నం చేసినమాట నిజమే. దుర్మార్గురాలయిన కన్న కూతురిని కడుపులోపెట్టుకుని కాపాడవా నాన్నా!

లక్ష్మీ : ఇప్పుడైనా ఒప్పుకుంటావా నాగేంద్రం?

నాగేం: అవును పొరపాటు జరిగింది.

ప్లీడ : అవును పాపం! అనుకున్నది కరక్టుగా జరిగితే ఆశలే ఫలించేవి పాపం. ఫోను చేయనా?

లక్ష్మీ : నిజం ఒప్పుకున్నారుగా, ఆగండి. సరోజా నిన్ను కూడా కొన్ని మాట లడగాలి.

సరో : నాన్నా!

లక్ష్మీ : వెళ్లు. ఈ మందు లోపల పెట్టిరా. తరువాత మాట్లాడతాను. [సరోజ వెళుతుంది]

నాగేంద్రం! నీవు పేరుకు తగ్గ మనిషివి. నా వంశ వృక్షాన్నే కాటువేసి నాశనం చేయబోయావ్. నేను చచ్చిపోయాననుకుని నీ ఆటలు సాగిద్దామను కున్నావ్. నాకున్న రోగం - ఉబ్బసం. ఉబ్బస రోగికి ఆయుస్సుకూడా ఎక్కువేనేమో! ఆ సంగతి నీకు తెలియదు పాపం! నీ ఆట కట్టింది.

[సుబ్బారావు వస్తాడు]

సుబ్బా: నేనుకూడా మానేగా మావయ్యా!

లక్ష్మీ : ఏవిటి?

సుబ్బా: పజిల్సు. మరి మీరు చచ్చిపోయారని వైరిచ్చారే!

లక్ష్మీ : ఇవ్వాలనే యిచ్చాను.

[ప్లీడరు అనుమానంగా లోనికి వెళతాడు]

సుబ్బా: అరె! చాలా ఆశ్చర్యంగావుందే. ఈమధ్య పజిల్సు గొడవలో పడి యితర విషయాలు ఆలోచించడం

మానేశాను. పాతిక వేలొస్తా యనుకున్నా పాతిక కానులు కూడా రాలేదు. అందుకే ఆడనని వొట్టేసుకున్నాను....అందుకే అన్నయ్య క్లోసింగు.... అరె మూల నట్లాగే కూర్చున్నాడే! వదినగారి ముకం చీకటిగా వుందే!

లక్ష్మి : వాళ్ల పాచిక పాఉలేదు.

సుబ్బా: ఓహో! వాళ్ల పాచిక పారడానికి ఇద్దరి ప్రాణాలు తీసేవాళ్లుకూడా.

[ ప్లీడరు వస్తాడు ]

ప్లీడ : ఒకటి పోయింది.

లక్ష్మి : ఏవిటది ?

ప్లీడ : సరోజ మీరిచ్చిన విషం తాగేసింది.

లక్ష్మి : సరోజా! [ లోపలి కెళుతూ ]

సుంద : [ఏడుస్తూ] నిజమేనా!

ప్లీడ : అనుమాన మయితే వెళ్లి చూడమ్మా! అబద్ధ మాడవలసిన అవసరం నాకేముంది ?

సుంద : చెల్లాయ్! [ఏడుస్తూ లోనికి వెళుతుంది]

సుబ్బా: [భయంగా] ఏవండి ప్లీడరుగారు ?

ప్లీడ : విడిచిపెట్టేసిన వాడికి నీకెందుకయ్యా యీ గొడవ.

సుబ్బా: మనిషి కోపంగా మాట్లాడినా మనసు చాలా మంచిదండి. మాటవరస కన్నాను గాని చస్తే విడిచిపెట్ట గలనా ?

ప్లీడ : ఆ పనే జరిగింది.

సుబ్బా: [ఏడుస్తూ] సరోజా! [లోపలకు వెళతాడు]

[లోపల సరోజా! సరోజా! అని ఏడుపు కంఠాలతో సుంద రమ్మ సుబ్బారావు పిలుస్తుంటారు. నాగేంద్రం అటు యిటు చూసి బైటికి వెళ్లబోతాడు. ప్లీడరు అడ్డుకుంటాడు.]

ప్లీడ : ఎక్కడికి?

నాగేం: అడ్డు తప్పుకోండి.

ప్లీడ : ఎందుకు?

నాగేం: ఆపు చేయడానికి మీ రెవరు?

ప్లీడ : వెళ్లిపోవడం నీ యిష్టమేనా?

నాగేం: అవును.

ప్లీడ : కాదు. నువ్వు హంతకుడవు. ముందు లోపలి పసిబిడ్డ ప్రాణం తీయబోయావ్. తరువాత నీ పేరుమీదనే సరోజ ప్రాణం విడవడానికి సిద్ధంగా వుంది. ఈ దురంతాలకు కారణ మెవరు?

నాగేం: [నిర్భయంగా] మీరు.

ప్లీడ : ఆఁ!

నాగేం: అవును. లక్ష్మీపతి గారికి తలలో నాలుక గా తయారై మీ సలహాలతో ఆయన చచ్చినట్లుగా వార్తలు పంపి కావలసిన వాళ్లలో కలతలు రేకెత్తించి అందరి ప్రాణాలకు ముప్పు తెచ్చి నేరనట్లు నటించింది మీరు. మీ ప్రాణాలమీద ఏ మాత్రం ఆశ...... వెంటనే తప్పుకోవాలి.

ప్లీడ : లేకపోతే!

నాగేం: దాని ప్రతిఫలం తక్షణం అనుభవిస్తావ్. [అని లోనుండి కైజారు తీస్తున్నట్లు నటిస్తాడు ]

ప్లీడ : [ చేయి పట్టుకుంటాడు ] కైజారు తీస్తున్నావా?

నాగేం: [ రెండో చేతితో ప్లీడరు చేయి తప్పిస్తాడు ]

ప్లీడ : అలాగా! సరే. [ దూరంగా తప్పుకుంటాడు. పాంటు జేబులోంచి పిస్టలు తీస్తున్నట్లు నటిస్తూ లోనుండి వేలుపెట్టి చూపిస్తూ ] ఊ! నీ కైజారు తీయ్?

[ సుందరమ్మ వచ్చి మాట వింటూంది ]

నాగేం: పేలుస్తారా?

ప్లీడ : నువ్వు పేలుస్తావా? చూడు, మీ ఆవిడ ఎదురుగా నిన్ను కాల్చి చంపకపోతే నా పేరు......

సుంద : [కెవ్వున అరచి భర్తకడ్డంగా నిలబడుతుంది] ప్లీడరుగారూ!

ప్లీడ : నీ మొకం చూసి వూరుకున్నాను.

సుంద : [ ఏడుస్తూ ] మా సరోజ స్పృహతప్పి పడిపోయిందండి. మా నాన్న ఆయాసంతో మాట్లాడలేకపోతున్నారు. తొందరగా వెళ్లి డాక్టరును తీసుకురండి. [ ప్లీడరు మాట్లాడడు. సుందరమ్మ భర్తవైపు తిరుగుతుంది ]

సుంద : మీరన్నా వెళ్లిరండి.

నాగేం: ఆయన వెళ్లనివ్వడంలేదు.

సుబ్బా: [ కంగారుగా వస్తాడు ] ప్లీడరుగారూ! సరోజ చచ్చిపోతుంది. తొందరగా వెళ్లి డాక్టరును తీసుకు రండి.

[ లోపలనుంచి లక్ష్మీపతి సరోజా! సరోజా! మాట్లాడవేం? అనే మాటలు వినిపిస్తున్నాయి ]

సుంద : [ వెర్రిగా దుఃఖంగా గుండెలు బాదుకుంటూ ] అమ్మయ్యో! మా సరోజ చచ్చిపోయింది.

[ లోపలకు పరుగెత్తుతుంది ]

సుబ్బా: [ దుఃఖావేశంలో ] ఏమండీ సరోజ చావడానికి సిద్ధంగా వుంటే కదలకుండా అలా నిలబడి చూస్తారు. వెళ్లి రండి.

[ ప్లీడరు మాట్లాడడు ]

సుబ్బా: మీ రెవ్వరూ వెళ్లక్కర లేదు. మా సరోజను నేనే డాక్టరింటికి తీసుకెళ్తాను. [ లోనికి వెళతాడు ]

[ ప్లీడరు ఆలోచిస్తూ వుంటాడు. సుబ్బారావు సరోజను చేతులమీద తీసుక వస్తాడు. వెనుక సుందరమ్మ కూడా వస్తుంది. ఎదురుగా డాక్టరు వస్తాడు. సుబ్బారావు చూస్తాడు. ]

సుబ్బా: వచ్చారా! సరోజ విషం తాగేసింది చూశారా?

[ సోఫామీద పడుకోబెడ్తాడు ]

సుంద : చూడండి డాక్టరుగారూ! మా రోజులేమీ బాగుండలేదు. తెలీని పిల్ల. తెలివితక్కువగా విషాన్ని తాగేసింది.

డాక్ట : సరోజా! సరోజా!

సరో : ఊఁ! [ మూలుగుతుంది ]

డాక్ట : విషం తాగేశావా?

సరో : ఊఁ!

డాక్ట : ఎందుకు తాగావ్?

సరో [ బాధపడుతూ ] నేను బ్రతకను. నేను చచ్చిపోతాను. చావడానికే విషం తాగాను. విషం తాగాను గాబట్టే చచ్చిపోతాను.

డాక్ట : [ సుందరమ్మకేసి తిరిగి ] ఎంత విషం తాగివుంటుంది.

సుంద : ఉన్నదంతా పూర్తిగా తాగేసిందండి.

డాక్ట : ఊఁ! [ నిట్టూరుస్తాడు ] చాలా ముదిరిపోయిందే.

సుంద : చెల్లాయ్ !

సుబ్బా: సరోజా!

డాక్ట : స్సూ!

[ లక్ష్మీపతి వస్తాడు. అటునుండి శాంతమ్మ వచ్చింది. ]

అదిగో శాంతమ్మ వచ్చింది. నా డ్యూటీ నేను చేసాను. వెళతాను.

సుంద : అదేవిటండి డాక్టరుగారూ! మా సరోజ.

డాక్ట : మీ నాన్నగారి పర్మిషన్ కావద్దూ?

సుంద : నాన్నా!

లక్ష్మీ : నోర్మూయ్ !

సుంద : [ భయంగా ] ఆఁ!

లక్ష్మీ : ప్లీడరుగారూ! ఆస్తికి గార్డియన్‌గా రాసిన కాగితాలు శాంతమ్మ కివ్వండి. సుబ్బారావు ఆస్తి దస్తావేజులు సుబ్బారావు కిచ్చేయండి. [ డాక్టర్ని ప్లీడర్ని చూస్తూ ] తీరని వ్యథగా నాలో నిల్చిన విషమసమస్యను మీ సహాయంతో పరిష్కరించుకో గలిగాను.

ఎవరు నా గోపీని ప్రేమిస్తున్నారో ఇప్పుడు స్పష్టంగా చూడ గలుగుతున్నాను. [సరోజను చూస్తూ] సరోజా! లే అమ్మా! సరోజా! నువ్వు తాగింది విషం కాదు షర్బత్.

సరో : ఆఁ! [మెల్లగా లేస్తుంది] విషం కాదూ! నిజంగా విషమే అనుకున్నాను. [శాంతమ్మనుచూస్తూ కళ్ల నీళ్లతో] నేను చేసిన తప్పులకు నన్ను క్షమించు అమ్మా!

శాంత : సరోజా! నేను క్షమించాల్సినంత లోపం నువ్వేం చేసావమ్మా! అది లోపమే అనుకుంటే ఆ లోపం నీలో కోపానిదే లే అమ్మా!

లక్ష్మి : సుందరమ్మా! సరోజా! ఓ పెద్దల్లుడు గారూ! సుబ్బారావ్. ఇక వెంటనే మీ యిళ్లకు మీరు దయచేయండి.

సుబ్బా: థాంక్స్ మావయ్యా! నాకు నచ్చిన మాటన్నావు. సరోజా రా! [నలుగురూ వెళుతూంటారు]

శాంత : ఆగండి. [లక్ష్మిపతితో] బిడ్డ ప్రాణం దక్కింది. కాని పీళ్లలో ఆశ అట్లానే వుండిపోయింది. ఈ సంతోష సమయంలో ట్రాన్స్‌పోర్టు నాగేంద్రంకి, ఫ్యాక్టరీ సుబ్బారావుకీ యిస్తే......

ప్లీడ : చాలా సంతోషిస్తావా? ఇదెక్కడి న్యాయమమ్మా! ఇంత శ్రమపడ్డా మాకేం లేదుకాని వాళ్లకా ఆస్తి పంచేది? ఎవరికన్నా యిస్తే ఒప్పుకుంటూ గాని ఆ నాగేంద్రంకివ్వడమంటే నా కిష్టం లేదు.

నాగేం: ఎందువల్ల?

ప్లీడ : హంతకుడవు గాబట్టి.

నాగేం: అవును. అందుకే పిస్టలు జేబులో పెట్టుకున్నాను.

ప్లీడ : పిస్టలు లేకపోయినా మొలలో కై జారుందిగా!

నాగేం: (ఆక్షేపణగా) ఇదే తెలివి. పెద్ద ప్లీడరవు మళ్లీ. (చొక్కా ఎత్తి) చూడండి. ఇప్పుడు ఎవరు హంతకులో తెలుస్తుంది. ఫాంటు జేబులో పిస్టలు పైకి తీయండి.

ప్లీడ : అరె! చాలా తెలివైనవాడివే. నీ చేతిలో నేను దొరికిపోయాను. (ఫాంటు జేబులోనికి చేయి పోనిచ్చి పిస్టలు మాదిరిగా పైకి తీసి పేల్చమంటావా?

నాగేం: (ఆశ్చర్యపోయి ఫాంటు జేబు వెతికి) పిస్టలు లేదూ?

సుబ్బా: అన్నయ్యా! బండి ఎత్తునుంచి పల్లంలో పడితే ఒకి బోల్తాయే కాదు కొట్టేది. వరసగా కొట్టుకుంటూనే పోతుంది. రా పోదాం. వాళ్లు పైనున్నారు. నీవు కింద పడ్డావు. మావయ్యా ఫ్యాక్టరీ మాత్రం నాదే గుడ్ బై.

(లక్ష్మీపతి, ప్లీడరు, డాక్టరు నవ్వుతూంటారు. గోపి, శాంతమ్మ దగ్గరకొస్తారు. సుందరమ్మ, సరోజ, సుబ్బారావు, నాగేంద్ర. వెళుతూవుంటారు. తెర కిందికి జారుతూ వుంటుంది.)

ఐ పో యిం ది.